# పద్యకథామంజరి

**[FOR THE COMPREHENSION**

**OF**

**IV, V & VI FORM**

(REVISED & ENLARGED)



కరణికోట వేంకటసుబ్బయ్య, ఎం. ఏ., ...

Presented by
D. Venkatasubba

శ్రీ

# పద్యకథామంజరి



గ్రంథయిత,

జికోట వేంకటసుబ్బయ్య, ఎం. ఏ., బి. ఇడి.,

ఆంధ్రోపన్యాసకుఁడు,

వేంకటగిరిరాజ కళాశాల,

నెల్లూరు.

## రెండవకూర్పు పీఠిక

ఉన్నతపాఠశాల విద్యార్థుల యర్థగ్రహణ సామర్థ్య పరీక్ష (Comprehension test) కు అనుకూలముగ "పద్య కథామంజరిని" సంకలించి 1945 లో ప్రకటించితిని. దానిని పెద్దలనేకులు ఆదరించి బహు పాఠశాలలో పఠ్యాంశముగ జేసి, ఆకూర్పు ప్రతులు అంతలో అయిపోయినవి. అట్లు ఈ రెండవ కూర్పునకు అవకాశము కలుగఁ గారణభూతులైన యధ్యాపక మిత్రులకు అత్యంతము కృతజ్ఞుఁడను. అనివార్య కారణములచే రెండవకూర్పు ప్రకటింప ఇప్పటికి సాధ్యపడినది.

ఈ ముద్రణమునఁ గొన్ని క్రొత్తకథలు స్వీకీయములు చేర్పఁబడినవి, కొన్ని పెద్దకథలు తొలఁగింపఁబడినవి. టీక పుష్కలీకరింపఁబడినది. ఏకథ ప్రశ్నలు ఆకథకు తుదిని నిబంధింపఁబడినవి. ఇట్లు గ్రంథోపయోగము సర్వథా పెంపొందింపఁబడినది. యథాపూర్వము ఈ గ్రంథము పెద్దల యాదరమునకును విద్యార్థుల యుపయోగమునకును పాత్రమై నాశ్రమము చరితార్థమగుఁగాక.

నెల్లూరు
2—6—48

గ్రంథకర్త.

## మూఁడవకూర్పు పీఠిక

పూర్వముద్రణ స్ఖాలిత్యము లిందుఁ దొలఁగింపఁబడినవి.

నెల్లూరు
1—7—50

ధరణికోట వేంకటసుబ్బయ్య,
గ్రంథకర్త.

# కథా సూచిక

*

శ్రీరస్తు

# పద్యకథామంజరి.

## 1. బకహంస సంవాదము.

క. "ఎవ్వఁడ వీవు, కాళ్లు మొగ
మెఱ్ఱన?" "హంసమ"; "నెందు నుందువో?"
"దవ్వుల మానసంబునను;"
"దాన విశేషము లెవ్వి? తెల్పుమా;"
"మవ్వపుఁ [1]గాంచనాబ్జములు
[2]మౌక్తికముల్ గల వందు;" "నత్తలో?"
"అవ్వి యెఱుంగ;" మన్న, నహ
హా! యని నవ్వె బకంబు లన్నియుఙ్.

—అజ్ఞాతమూలకము.

1. బంగారు తామరపువ్వులు. 2. ముత్తెములు.

ప్రశ్నలు:—(1) బకహంసములకు ఏ యంశముల రూపభేదము?
(2) మానస సరోవరమున నేమి విశేషములు?
(3) బకము లెందులకు హంసనుజూచి నవ్వినవి?
(4) నీతి ఏమి?

## 2. మేధావి

సీ. బాలధి యను మునిప్రవరుండు పుత్త్రకో
కాపనుఁడై, ఘోర మగుతపంబుఁ

జేసి, వేల్పులదయఁ జిరజీవిగాఁ బుత్త్రుఁ
బడసె, మేధావి నాఁ బరఁగువాని;
వాఁడు నాయుష్యగర్వమున మునీంద్రుల
నెవ్వరి మెచ్చక, యోఁగి యొక్క
ధనుషాక్షుఁ డనుతపోధను నొద్ద గర్వించి
పలికిన, నలిగి తపస్వి వాని
ఆ. [1]నంతకాంతికమున కరుగంగఁ జేసె; గ
ర్వంబు చెట్ట యెట్టివారి కైనఁ;
[2]గాల్చుఁ దక్షణంబ గర్వంబు; గర్వంబు
[3]నొడిచి యున్నవాఁడ యుత్తముండు.

—అరణ్యపర్వము III

1. యముని యింటికి. 2. నశింపఁచేయును. 3. విడిచి.

ప్రశ్నలు:—(1) మేధావి ఏల గర్వించెను? ఏమి చేసెను?
(2) ఆతఁడెట్టి ఫలమనుభవించెను?
(3) ఎవఁడుత్తముఁడు? ఏల?

## 3. [1]కృపణ పాంథుఁడు.

సీ. ఆఁకొని [2]యసురుస్సురై పాంథుఁ డొకరుండు
[3]విపణిలో నా అట్లు [4]విలిచి తెచ్చి
కొని, కౌతుకముతోడఁ దినె నొక్కటొక్కటి;
తీఱె నాఱవదానఁ [5]దీఱ క్షుత్తు;
అది చూచి కృపణాత్ముఁ డాపాంథు డిట్టుల
నంగలార్చుఁ దొడంగె, "నక్కటకట!

యే నెంత బుద్ధి విహీనుండనో కాని,
వ్యర్థంబుగాఁ దొంటియట్టు లైదుఁ
బొట్టఁ బెట్టికొంటి; మొదలనే యీతుది
యట్టు నేల తినఁగనైతి? దాన
నొక్కదాననే [6]మ దుగ్రక్షుద్బాధ తీ రా
పాటి యుండు" నంచుఁ, బరులు నవ్వ.

—స్వకీయము.

1. లోభియైన, 2. మిక్కిలి గాసిపడిన, 3. అంగడిలో, 4. కొని, 5. పూర్తిగా, 6. గొప్పదైన యాఁకటిబాధ.

ప్రశ్నలు:—(1) ఆఁకలిచే పాంథుఁ డేమిచేసెను?
(2) మొదటి మైదట్లుతినుట ఏల వ్యర్థమని అతఁడనుకొనెను?
(3) అతఁడెట్లు 'కృపణాత్ముఁడు'?
(4) పరులు ఎందులకు నవ్విరి?

# 4. సరికి సరి

ఆ. [1]ప్రాడ్వివాకుఁ డొకఁడు పరమ నీచాత్ముఁడు
[2]ధని గులాము, [3]గుప్తదాన వశుఁడు,
వాదిపక్ష మూని ప్రతివాదిఁ బరుషవా
రీతి నిట్లు లాడె నీతి మాలి.

క. "ఈ కట్ట కొనను మూర్ఖుఁడు
మేకొను నిదెచూడుఁ డనుచు [4]మిడిఁ బలుక నతం,
"డేకొనను దేవరా!" యని
[5]వాకొనెఁ బ్రతివాది, యచటి వారలు నవ్వన్.

—కీయము.

1. న్యాయాధికారి, 2. ధనికులబంటు, 3. లంచము నకు దాసుఁడు, 4. గర్వముతో, 5. పలికెను.

ప్రశ్నలు:—(1) న్యాయాధికారి వాదిపక్షు మేల పూనెను?
(2) ప్రతివాదినిగూర్చి అతఁడేమి పలికెను?
(3) ప్రతివాది ఏమి బదులుబలికెను? దాని తాత్పర్యమేమి?

## 5. వ్యర్థబోధనం బనర్థకరము

తే. కానఁ దిరుగాడ కొకచోటఁ గపులు గూడి
[1]కడిఁదిచలిచేత మేనులు కడు వడంక,
రాత్రి మెఱుఁగారు [2]ఖద్యోతరాజిఁ జూచి
[3]కణఁకు గాఁబోలు నని [4]సీతు గాఁచుచుండ.

క. సూచీముఖ మనువిహగం
బాచేరువ నుండి [5]యనల మది గా దని యా
లోచన చేసి, యొక కపి
కాచందము తెలియఁ జెప్పె నాదరలీలన్.

క. ఈరీతిఁ బలుఁగు పిలువని
పేరఁట మేతెంచి, చెవులు బీఱువడన్ వే
సారక చెప్పఁగ, నందొక
క్రూర[6]ప్లవగంబు పండ్లు గొఱుకుచుఁ గినుకన్

ఆ. "అడుగ కూర కేల నోడువుదు విప్పుదు?
వట్టినోటితీఁట పుట్టె" ననుచుఁ
బట్టి దాని రాతిపైఁ [7]బ్రామి వధియించె;
[8]*వ్యర్థబోధనం బనర్థకరము. (పంచతంత్రము-మిత్రభేదము.)

1. మిక్కిలి, 2. మిడుఁగుఱుఁ బురువులగుంపు, 3, 5 ని
4. చలిగాఁచుచుండ, 6. కోఁతి, 7. తాఁచి, 8. పనికిమాలినవా
బోధించుట.

ప్రశ్నలు :—(1) చలిచే కపులు ఏమిచేసినవి?
(2) సూచీముఖము ఏమిచెప్పెను? ఏల చెప్పెను?
(3) కోఁతి కేల కోపము వచ్చెను? ఏమి చేసెను?
(4) బోధనము ఎప్పుడు అనర్థకము? ఎప్పుడు సార్థకమ

## 6. వాగ్దోషము

సీ. ఒకయూర నొకచాకి యొక్కగాడిదఁ దెచ్చి
దాని లావుగ మేపఁ దలఁవు పుట్టి,
పులితోలు పైఁ గప్పి, పొసఁగఁబండినచేలు
మేయ రాత్రులు దోల, మేసి తిరుగఁ,
బులి యనుబుద్ధి నా పొలముకావలివారు
దూరంబుననుఁ జూచి తొలఁగి పఱవఁ,
బైరెల్ల వృథ యైనఁ బరికించి, యొకనాఁడు
విసివి యొక్కరుఁడు సాహసముతోడఁ

తే. గడఁగి దూరంబునందునఁ గంబళంబు
గప్పికొని, వింట శర మిడి కాచియుండ,
నాఖరము వచ్చి యాతని నచటఁ గాంచి
పెంటిగాడిద యని చాలఁ [1]బృథురవమున

వ. చేరం జూచి, దానికయి పొంచియుండినయతండు,

క. "పులి యని పాఱితి; నక్కట!
[2]బలుగాఁడిద, [3]యెలుఁగుకతన బైలయ్యె; నిఁకఁ గా
నోలఁగ భయంబ జే?" లని యొక
[4]పలలఘుప్రదరమున దానియసువులఁ బాపెన్. 3

పంచతంత్రము - సంధి

1 పెద్దధ్వనితో. 2 పెద్ద. 3 కంఠస్వరముచేత. 4 పెద్దబాణముతో

ప్రశ్నలు:— (1) చాకివాఁడు చేసినయుక్తి ఏమి?
(2) గుట్టు ఏల బయల్పడెను?
(3) నీతి ఏమి?

## 7 భేరీ జంబుకముల కథ

తే. ఎసఁగు నాఁకటిపెల్లున నిందు నందు
నడవిఁ జరియించి, యాహార మబ్బకునికి
నలసి, యొకజంబుకంబు భాగ్యమునఁ గాంచెఁ
గలహ మొనరించి పోయిన [1]కదనభూమి. ౧

వ. అందుఁబడియున్న బహుప్రాణికళేబరములఁ గౌతుకముతోఁ
గనుచుండ గుండె లవియునొక మహాధ్వనియుప్పతిల్లుడు, ౨

సీ. అమ్మహాధ్వని విని యత్యంతభయముతో
[2]మృగధూర్త మట్టిట్టు మెదల వెఱచి,
కను మూసి తెఱవ, కెక్కడఁ జొత్తు? నని బుద్ధి
శోకించి, కను విచ్చి చూచునంత
ధారుణిఁ బడియున్న భేరీముఖంబునఁ
దరుశాఖ గాలిచేఁ దాఁకుచుండఁ
బొడగని, తనలోనఁ బొడమినభయ మెల్లఁ
బోయిన, నాభేరి డాయ వచ్చి,

తే. "అప్పు డిది గాన నేరక యధికభీతిఁ
బాఱిపోవఁగఁ జూచితిఁ బట్టు విడిచి;
సుముఖమై భాగ్యదేవత చూపె నాకు;"
ననుచు నానక్క యాత్మ నిట్లని తలంచె. 3

తే. "ఇది మహాభోగ్య మిచ్చట నౌదవె నాకు;
నిప్పు డిది 3వ్రచ్చుకొని చొచ్చి హిత మెలర్ప,
వలయుమాంసంబు భక్షింపవచ్చు;" ననుచు
నేచి యాభేరి వ్రచ్చి యం దేమి లేక. ४

*క. "ఔరా 5యంతస్సార వి
దూరులయాడంబరంబు! దుర్భ్రమచే నీ
భేరి వృథా వ్రచ్చితి;" నని
4ఫేరవము నిరాశ నరిగె విపినాంతమునకు. ౫

పంచతంత్రము - మిత్రభేదము.

1 యుద్ధభూమి, 2 నక్క, 3 చీల్చుకొని, 4 నక్క, 5 లోపల సారము లేనివారియొక్క

ప్రశ్నలు :— (1) జంబుకమునకుఁ గలిగిన భయకారణ మేమి? 3 అదెట్లు తొలఁగెను?

(3) దానికిఁగలిగిన యాశయేమి? అది ఎట్లు వ్యర్థమయ్యెను?

(4) అది ఏమనుకొనెను?

## 8 పరోపదేశపాండిత్యము

ఆ. పావురమును దఱిమిపఱచు 1గృధ్రం బొండు
2మృగయుచేతఁ జిక్కి వగచె నిట్లు,

"నీకు ద్రోహ మెప్డు నేను జేయఁగ లేద,
నన్నుఁ బట్ట నీకు న్యాయ మగునె?"

క. అని పలుకునట్టి గద్దకు
ననె మృగయుం, "డవునుగాని, యీపావురముఁ
బనిపూని చంపఁ జనె, దది
ఘనవిద్రోహమ్ము నీకుఁ గావించెనొకో? ౨

క. ఒరులకుఁ ద్రోహము సేయుచు,
నోరు తెల్లం దనకు నిత్య ముపకారంబుఁ
3బరిపరి చేయఁగవలె నను
4దురితాత్ము మొగంబు సూడ దోసమురాదే? ౩

క. కావున గృధ్రమ, నీ వీ
పావురమం దెట్టిరీతి వర్తించెదవో,
యావిధముగనే నీయెడ
నే వర్తించెదను; నీతు లేలా పలుకన్?" ౪

స్వకీయము

1 గద్ద 2 వేటగానిచేత 3 మాటిమాటికి 4 పాపాత్ముని

ప్రశ్నలు:—(1) గద్ద వేటగాని నేమని మందలించినది?
(2) వాఁడేమి బదులు చెప్పెను?
(3) నీతి యేమి?

# 9 లోభి నక్క

సీ. విజయపురప్రాంత విపినాంతరమునకు
బోయ యొక్కఁడు వేఁటవోయి, యచట
వనహస్తిఁ గనుఁగొని, [1]వల్మీక మెక్కి భ
ల్లమునఁ గుండము గ్రుచ్చి సమయఁజేసె;
వానియెక్కిన పుట్టలోను వెల్వడి భుజం
గం బక్కిరాతునిఁ గఱచె నంత;
వాఁడును మొల నున్న వాఁడికుఠారంబు
గొని దాని వధియించి, కూలి [2]యీల్గె

ఆ. నచటి కొక్కనక్క యరుదెంచి ముదమంది,
"యేనుఁ గాఱునెలలు, మానవుండు
సప్తవాసరములు, సర్ప మేకదినంబుఁ
బోవుఁబొమ్ము నాకు భుక్తి" కనుచు.

క. "నేఁటి కివి తగంటి పెట్టఁగ
నేటికి? నీబోయ వింట నిడ్డనరము లీ
పూఁటఁ గడపఁ జాలవె? యొక
నాఁటం బ్రాణంబు సనునె నవసినమాత్రన్?"

[కేయూరబాహు III]

క. అని తలఁచి, యెక్కుపెట్టిన
[4]గొనయముఁ గొఱుకంగ, [5]వింటికొమ్ము[6]రొక్కునఁదాఁ
కిన, నా జంబుక మీల్గెను;
. బెనులోభికి [7]భావికార్యవిధ మెఱుకయొకో!

1 పుట్టి. 2 వచ్చెను. 3 గాటు. 4 అల్లెత్రాడు. 5 వింటి దబ్బ కొన. 6 బ్రోమ్మన. 7 మీఁదటి.

ప్రశ్నలు :—(1) వేటకాఁడేమి చేసెను? ఏమాయెను?
(2) నక్క ఏమనుకొనెను?
(3) నక్క ఏమిచేసెను? దాని ప్రతిఫలమేమి?

## 10 సమయస్ఫూర్తి

సీ. శ్రీకృష్ణదేవరాట్ క్షితినాథు [1]ననిమిత్త
క్రోధోగ్రవహ్నికి [2]గోచరుండు
నరపతి యొకఁడు తన్నొరులు గావఁగ నేర
రని యెంచి, [3]నిభృతంబుగను నధీశు
[4]నర్మసఖుం జేరి, [5]నతి చేసి "నను గావ
నీభార" మని వేఁడ [6]స్నిగ్ధరీతి
నతఁ, "డభయాత్ముఁడ నై మను చిరకాల"
మని తీర్చె నాతని [7]యాధి కొంత;
చండశాసనునకు సార్వభౌమునకు నా
మంతునందు ఘన [8]మమర్ష మనుచు
నెఱిఁగికూడ నభయ మీ సాహసించె; నా
నర్మసఖుని ధైర్యమర్మ మేమొ!

క. చనువున నెప్పటివలె నా
దినమును నా నర్మసఖుఁడు [9]స్థిరపతి కడకుఁ
జని, 'యొక్క విన్నపం'బని
వినయమున వచింప, నతని విభుఁ డిట్లనియెన్

ఆ. "హీనుఁ డాన రేసు ప్రాణంబు లడుగఁగా
వచ్చినాఁడ; వేల యిచ్చకములు?
రాజు నాదు చే[10]తరాజని యెంతె? నీ
వడుగుదానిఁ జేయ ననుట నిజము." 3

క. అన విని సమయస్ఫూర్తియు
వినయముఁ బెఱయంగఁ బల్కె వెస "మీవాక్కుల్
[11]గనవు వికల్పం; బానృపు
ఘనదండితుఁ జేసి, నన్నుఁ గను దయను ప్రభూ" ౪

వ. అని నర్మసఖుఁడు నేర్పుమైఁ బల్కిన, ౫

ఆ. నీవుకోరుదాని నేఁ జేయ నని వల్కి
దండనం బొనర్పఁ [12]దగవు గాక,
నిరపరాధియైన సామంతు [13]నెఱి సైచి
ప్రోచెఁ గృష్ణరాయ భూమిధవుఁడు.

—స్వకీయము.

1. అకారణమైన, 2. పాత్రమైనవాఁడు, 3. గుప్తముగా వినయముతో, 4. వేడుక చెలికానిని, 5. నమస్కారము, 6. స్నేహితునివలె, 7. మనోవ్యాధి, 8. కోపము, 9. పుడమిఱేని, 10. త్రాసు, 11 సందేహమును పొందవు—అసత్యములు కావనుట 12. న్యాయము, 13. పూర్తిగా క్షమించి.

ప్రశ్నలు:— (1) సామంతరాజుపై రాజుకోపమునకు ఏమినిమి
(2) సామంతుఁ డెవరిని శరణుసొచ్చెను?
(3) నర్మసఖుఁడు తెలిసి ఏల యభయ మిచ్చెను?
(4) నర్మసఖుని రా జెట్లు చీవాట్లు పెట్టెను?
(5) నర్మసఖుఁడు సామంతు నెట్లు రక్షించెను?

## 11. అమృత మాలసింప నౌ విషంబు

సీ. ఆలస్యమును నసహాయత్వమును నొప్పు;
వవి లేని పతి సుఖియై చరించు;
మును పొక్క [2]లొట్టెనుఁ గనితర సాధ్య త
పంబు సేయఁగ మెచ్చి బ్రహ్మ వచ్చి,
"యర్థించినది యేమి?" యనిన, నాలొట్టెనుఁ
"గొప్ప నామెడ శతయోజనప్ర
మాణం బగుట కోర్కి, వాణీశ;" నావుడ
"నట్లగుంగా"కని యతఁడు సనియె;

తే. నదియు వరగర్వమున సహాయంబు నొల్ల
కలసభావంబుతో నుండి, వలచి యొక్క
నాఁడు దనయుత్తు సాఁచి కాననములోన
[4]దినుకొని మేయఁగాఁ జెనువాన వచ్చె,

క. వచ్చిన, దన మెడ సాఁగిన
యచ్చటి గుహలోన [5]నుత్తమాంగంబు బడె, తా
నిచ్చ మెయి నిదురపోవఁగ;
విచ్చలవిడి నొక్కనక్క వెలఁదియుఁ దానున్.

*ఉ. ఆ గుహ సొచ్చి, మిక్కుటపు
ట్టాఁకలి బాధకు నోర్వలేక, వే
వేగను లొట్టికుట్టుకను
వేక్కుమెయిన్ గబళించి, నెత్తురుల్
ద్రాగుచుఁ గండలన్ దినుచుఁ
గ్రాలుచు, మేల్కాని లొట్టె ప్రక్కకున్
లాగి పొరల్చి కంఠమును,
6లాలస నిద్దురపోయె నెవ్వడిన్, 3

వ. ఆ 7మృగధూర్తదంపతులు దానికంఠంబు తెగఁగొఱుక,
నలసత్వంబున నుష్ట్రంబు నిర్గతప్రాణం బయ్యెను. ౪
—శాంతిపర్వము III.

1 రాజు. 2 ఒంటె. 3 ఇతరులకు సాధ్యపడని. 4 హాయిగా.
5 తల. 6 అధికేచ్ఛతో. 7 నక్క దంపతులు.

ప్రశ్నలు:— (1) ఒంటె ఏమివరము కోరుకొనెను? (2) వరగర్వముచే
అది ఏమిచేసెను? (3) అది ఎట్లు చెడెను? (4) ఏల?

## 12 మూర్ఖరాజు

ఆ॥ కుంతలేశుకొలువు కూటంబునకు నశ్వ
వణిజుఁ డొకఁడు వచ్చి, [1]వరహయములఁ
గొన్ని [2]నజరుపెట్టి, [3]కొండాడి రాజును,
విక్రయించె నన్ని వెలలు పెంచి.

ఆ. అట్టిమేటి కెంపుల నవ్వారిగాఁ గొన
నెంచి, యపరిచితుఁ డటంచుఁ దలఁప
కిచ్చె వర్తకునకు మెచ్చి మున్ముందుగా
రసికకోటి మూర్ఖనృపుఁ డతండు.

సీ. అనతికాలమున కా యవనీశుఁ డొకవింత
యాజ్ఞ చేసెను, దన యవనియందుఁ
గలమూర్ఖజనుల పేరులు వ్రాసి తెమ్మని;
యక్కజంపడి యప్పుడతని మంత్రి
రాజాజ్ఞ మేరకు రచియించి మూర్ఖనా
మావళి యర్పించె; నధిపుఁ డందుఁ
దన పేరు [7]మూర్ఖవితతి నాదిఁ దిలకించి
యచ్చెరుపడి మంత్రి నడిగె; నతఁడు

తే. "దేవ, యారివింత వణిజునకీవు గాక
యంతరొక్కము ముందుగా నన్యుఁ డిచ్చి
కొల్లబోవునె?" యనివల్కఁ, గువలయేశుఁ
డనియె, "నాబేరియరుదేర, నపుడో?" యనుచు

ఆ. "వచ్చునేని బేరి, వసుధేశ, నీపేరు
తుడిచివైచి బదులు [10]తూర్ణముగ నె
మూర్ఖనామమాల మొదలన లిఖియింతు
నతని నామధేయ" మనియె మంత్రి!

1 నేలైనగ్రామములను 2 కానుక 3 సొగడి 4 వస్త్రములను 6 కోటివరహాలు 7 మాన్యులసముదాయములో 8 శ్రోత్రియమైన 9 వర్తకుఁడు 10 త్వరగా,

ప్రశ్నలు:— (1) వర్తకుఁడు ఎట్లు వెలుగొందుచుండెను?
(2) రాజుచేసిన వింతయాజ్ఞయేమి?
(3) మంత్రి ఏమిచేసెను?
(4) రాజు ఏల ఆశ్చర్యపడెను? ఏమని యడిగెను?
(5) మంత్రి ఏమి బదులుచెప్పెను?
(6) రాజు మరల నేమిసవాలుచేసెను? ఆప్రశ్నలనుబట్టి అతని అభిప్రాయమేమి?
(7) మంత్రి ఏమిసమాధానము చెప్పెను?
(8) వర్తకుఁడేల మూర్ఖుఁడగును?

## 13 సోమశర్మజనకుఁడు

సీ. పరగ విద్యాభ్యాసపరుఁ డొక్కవిప్రుఁడు
తనియ [1]మహాలయంబున భుజించి
చనుదేర, నొండొక [2]సదనంబువిప్రుండు
పితరులకై పేలపిండి యిడినఁ
గైకొని, తా నొక్కఘటము సంపాదించి
పొందుగా నాసక్తువందుఁబోసి,
చేతికందెడునట్టి చేరువ నాకుంభ
మమరంగఁబ్రీతుఁడై యచటఁ బెట్టి,

గీ. సమధురోత్కృష్టభోజనోత్సవముకతన
నతఁడు సుఖసుప్తి నొందెఁ; దదవసరమున,

* నతఁడు తీయన స్వప్నంబునందు నిటుల
గురుమనోరథ మంతయుఁ గోరసాగె,— ౧

(నారాయణ కవి)

సీ. అదన నీసక్తి వమ్మైద; నమ్మి యొకమేఁక
గొనియెద; గొనకొని కొనినమంద
నేఁటేఁట నొక రెంటి నీనెడు నవియును;
నవియు వానికిఁ బుట్టినవియు నీన
బహువత్సరములకు బహుసహస్రంబులై
నెగడెడు; వాని నన్నింటి నమ్మి,
సంతరించెద ధేనుశత; మది పెట్టిన
కోడెలధనముచేఁ గొనినచేల

గీ. విరివిగాఁ బైరు వి త్తింతు; వేళ్లఁ 6గొలుచు
గాఁగ 7మామకసస్యము ల్గడు ఫలించుఁ;
బంటకొలు చమ్మి కూర్తు నపారధనము;
ధనకుఁ డని నాకు నొకఁ డిచ్చుఁ దనకుమారి. 3

(వేంకటనాథుఁడు)

వ. దానిని జేపట్టి పెద్దకాలము సంతతి లేకయుండి,

గీ. పెక్కునోములు నోమంగ భీతహరిణ
నేత్ర గర్భంబు ధరియించి పుత్త్రుఁ గాంచ,
వాఁడు నత్యంతసుకుమార వైభవమునఁ
బ్రేమతో సోమశర్మనాఁ బెరుఁగుచుండె.

చ. "పని 8తమకంబునన్ గృహిణి,
బాలకు నెత్తికయుండు దెట్లు సీ?"
వని, 9భ్రుకుటీవికారవద
నాంబుజుఁడై వసుధామరుండు వేఁ
దసకరమందు నున్నఘన
దండముతో సతి నేసిపేర్చి, పె
ట్టునఁ గలశంబు భగ్న మగు
డుం, దెలివొంది యనంతరంబునన్ ౭

వ. ఇట్లు తనమనోరాజ్యంబు 10మిథ్య యగుటయు, సంపాదించినపిండి నేలపాలగుటయుఁ దలంచుకొని చింతాక్రాంతుఁడై యూరకుండెను. ౮

—పంచతంత్రము - అసంప్రేక్ష్యకారిత్వము.

1 మహాలయ పర్వదినమునఁ బెట్టు శ్రాద్ధమున 2 ఇంకొకయింటి బ్రాహ్మణుఁడు. 3 పితృదేవతల ప్రీతికై 4 పేలపిండి 5 యుక్త సమయమున 6 వేళ్ళుకూడ ధాన్యముగా 7 నాయొక్క 8 త్వరచే 9 బొమముడిచే 10 అసత్యము.

ప్రశ్నలు:— (1) సోమశర్మజనకుని సుఖనిద్రకు కారణమేమి?
(2) అతఁడు ఎట్లు ధనికుఁడగును?
(3) భార్యపైని ఏల అలిగెను? ఏమిచేసెను?
(4) దాని ఫలమేమి?
(5) నీతి ఏమి?

## 14 విశృంఖలవృత్తి

తే. గాలిపట మొకండు సవిలాసలీల గగన
తలమునం దాడుచుండి తాఁ దలఁచెనిట్లు,-
"అంబరంబున స్వేచ్ఛావిహారసుఖము
దక్కనీయద యీపాడుదార మెపుడు.

క. అక్కట! యీప్రతిబంధం
బిక్కరణిని నిగ్రహింపదే, నున్నత మా
దిక్కను జేర నె? నా కిఁక
నెక్కడిస్వాతంత్ర్యగరిమ, యెక్కడి[2]బుద్ధుల్?"

క. అని యది వగచెడునపుడే
తునిఁగెను దారంబు; దాస్యదురితము వోవన్,
ఘన మగు స్వేచ్ఛాభ్యుదయం
బును గాలిపటంబు గాంచె ముదమొలయంగన్

క. గ్రక్కున దారము వోయిన
దక్కను స్వాతంత్ర్య మంచు దలముగ మురియన్
[4]చుక్కా నఱు పోతమువలె
నక్కట! యాగాలిపటము [5]హావడి నొందెన్.

ఆ. తొంటిదావ్యవస్థ తొరఁగి, తాఁ బెనుగాలి
కొట్టినట్టు లెల్లఁ గొట్టఁబడుచు,
తుదిని జెట్టుకొమ్మఁ దొరఁగి [6]శీర్ణంబయి
యిట్టు లుమ్మలించె హృదయ [7]మగల.

క. "పెనుగాలి, చెట్టుకొమ్మలు
మునుఁగాఁ గల యాపదలను మునుఁగని యటులన్
నను నడపి కాచె 8సూత్రం,
బనిశము దేశికుఁడు శిష్యు నరయు నయమునన్.

ఆ. 9సేమమరసి నడపు 10శ్రేకర నయసూత్ర
సరణిఁ దెలియలేక జనుఁడ నైతి;
దేనెపూఁత కత్తి తీరా 12విశృంఖల
వృత్తిఁ బూని నాశ మేను గంటి. ౭

—స్వకీయము.

1 వెనుకకులాగఁడని 2 వృక్షులు 3 సంతోషించుచుండఁగా, (కర్త గాలిపటము) 4 చుక్కానుపోయినపడవవలె 5 ఆపద 6 చినిగిపోయినదై 7 పగులఁగా 8 దారము 9 క్షేమము 10 మేలుచేయునట్టి నీతిసూత్రవిధానము 11 నీతినియమమునకుఁగట్టుబడని విచ్చలవిడివర్తనము.

ప్రశ్నలు :— (1) గాలిపటము దారమునుగూర్చి ఏమనుకొనెను?
(2) గాలిపటమునకు ఎట్లు స్వాతంత్ర్యముకలిగెను?
(3) అది దాని నేల చిరకాల మనుభవింపలేదు?
(4) ఆ గాలిపటము దేనితోఁ బోల్పంబడెను?
(5) గాలిపటము ఏమని యుమ్మలించెను?
(6) ఎట్టిస్వాతంత్ర్యము మంచిది?

## 15 సింహగార్దభముల కథ

సీ. కలఁ డుగ్రవనములోపల నొక్క మృగరాజు;
1గోమాయు వతనికిఁ గూర్చు భృత్యుఁ

దై పంపుచేయంగ, నమ్మృగేంద్రుఁడు జంబు
కముఁజూచి పలికె దైన్యము దలిర్ప,
"ననఘ, 2మహోదరవ్యాధి నాతనువున
నొదవి యంతంతకు ముదురఁజొచ్చె;
ననుగుణంబగు మందు లరసి సేవింపక
యూరకుండిన, మీఁద నొప్పకుండు;
తే. గార్దభము గుండె చెవులును గలిగెనేని,
యాపథంబున నది గూర్చి యారగించి
మచ్ఛరీరంబురోగంబు మాన్పికొందుఁ;
గానఁ గొనిరమ్ము ఖరము నాకడకు వేగ"
చ. అనిన మహాప్రసాద మని
యా1మృగధూర్తము పోయి 3రోయుచున్
జని, నగరో4పకంఠమునఁ
జాకలవాని కృశాంగ గార్దభం
బును బొడగాంచి స ద్వినయ
పూర్వముగా మృదుభాషణంబులన్
గనికరమొప్పఁ బల్కి యధి
కంబగు నేర్పున నాశ్రుణంబునన్,
వ. 5ఎలయించి తెచ్చియిచ్చిన మృగనాథుండు దానిని సమ
యించి నక్కతో నిట్లనియె.
గీ. "6దినముఖోచితకర్మంబు దీర్చి వచ్చి
యనుభవించెద; నందాఁక నరసియుండు

మనుచు సింగంబు నడికిఁడా నడుగఁ జూచి
జంబుకంబు తలంచె మనంబులోన,—

సీ. "దివ్యౌషధం బని చెప్పించి మృగరాజు
నన్నుఁ గావలిపెట్టి నదికిఁబోయెఁ;
నీమందు మృగపతి కేల పోవఁగనిత్తు?
గ్రక్కున నతఁడిందు రాక మున్న
భక్షించి నామేనఁ బరఁగు రోగములెల్ల
హరియింతు ననుచు, మహాభిలాష
మొదవ గార్దభకర్ణ హృదయంబు లప్పుడ
తోడిఁబడి తిని మూతి దుడిచుకొనుచు,

తే. నంత [7]హరివచ్చి, "యీగార్దభావయవము
లెక్కడికిఁబోయె నివు?" డన్న, నెఱుఁగనట్లు,
"మూర్ఖచిత్తున కెందైన మొదలఁగలవె
హృదయకర్ణంబు? లది చూడ కెఱుఁగ కంటి, ౧

వ. కావున నీగార్దభంబునకు హృదయకర్ణంబు లులేే;" వనిన
నట్లకాఁబోలు నని యామృగేంద్రుం డూరకుండె. ౨

—పంచతంత్రము, లబ్ధనాశము.

1. నక్క, 2. పొట్ట నీటిచే బూరటించురోగము, 3. వెదకుచు,
4. సమీపమున, 5. బేలుపుచ్చి ఆకర్షించి, 6. ప్రాతఃకాలంపు,
7. సింహము.

ప్రశ్నలు:— (1) సింహము నక్కతో నేమిచెప్పెను?
(2) నక్క గాడిద నెట్లు తెచ్చెను?
(3) సింహము నదికి ఎందులకుఁ బోయెను?
(4) ఆలోపల నక్క ఏమని తలపోసెను? ఏమిచెప్పెను
(5) సింహమునకు నక్క ఏమి సమాధానము చెప్పెను?
(6) నీతి ఏమి?

## 16 కపటవ్యాఘ్రము

క. నర్మద దరి నిజహింసా
కర్మం బోరు లెఱుఁగకుండఁ గాఁపురముండున్
ధర్మమునఁ జరించు కపట
ధార్మిక మొక్కపులి యొక్కతరుకుంజమునన్

*ఆ. అడవిమృగములెల్ల 1నప్పుండరీక ధ
ర్మ ప్రవృత్తిసూచి, "రాజవగుము
మా," కటంచు వేఁడ, "నాకు హింసాధర్మ
దండన పుసరణి తగదుగాన;

*క. న్యాయాన్యాయ వివేచన
సేయుచుఁ దగినట్టిరీతి శిక్షించెద;" నాన్
శ్రేయం బని సంతసమున
నాయడవిమెకంబు లన్ని యది యొప్పుకొనన్.

క. ఒక్కయెడం, దమలో నొక
బొక్కకు 2వాదడిచి శశకముఁ గపింజలముం

గ్రక్కునఁ బఱతెంచి పులికి
మ్రొక్కుచు నిజవాద మిరవుగం జెప్పఁబడియెన్. ౪

వ. ఆ వ్యాఘ్రంబు వానితోడ, ౫

తే. "ముదిసినారము; కానము మున్నువోలె;
శ్రవణముల దూరమును వినశక్తి లేదు;
కదియఁ జనుదెంచి చెప్పుఁడు కార్య;" మనుఁడు
నవియుఁ దేకువ మాలి డాయఁగ నడువ; ౬

క. ముందటి [3]కాళ్ళం గొని యా
కుందేలుం [4]గైదుఁ బట్టుకొని గొంతుక నం
దంద గఱచి భక్షించి [5]య
తంద్రప్రీతిఁ బులి [6]శౌర్యతత మైయుండెన్ ౭

—కేయూరబాహు II

1 ఆపులియొక్క. 2 వాదాడి. 3 కాళ్ళతోఁబట్టి. 4 కాజును=కపింజలమును. 5 [తూఁగులేని=] అధిక ప్రీతితో. 6 శౌర్యముచే వ్యాపించినదై

ప్రశ్నలు:—(1) అడవిమృగములు పులి నేల రాజు గమ్మనినవి?
(2) అది ఏమనెను?
(3) పులికాపట్యము ఎట్లు బయటపడెను?

## 17 సెట్టియుక్తి

ఆ. సందుఁ జూచి దొంగ పెండలకడ సెట్టి
యిల్లు సొచ్చి యటుక నెక్కి యుండె;

భోజనంబుచేసి పాత్రియు శ్రీస్త్రియు
సెట్టిఁ జేరిరి కడు శీఘ్రముగనె.

ఆ. 2కనుమూచి నిదుర నందిరో యరయఁ గాఁ
దోఁగిచూచె నపుడు దొంగవాఁడు;
ఆతనిజాడ సెట్టి యంతలోఁ గనిపట్టె;
కాని, దొంగఁ బట్టఁ గలఁడె యతఁడు!

ఉ. 3పెల్లుగ నార్చి యెల్లరను
బిల్వఁగ నెంచియు సెట్టి, 4తెక్కలీఁ
డల్లన 5దీమసించి దిగి
యాలిని దన్నును గొట్టిపోవు నం
చుల్లమునం 6దలంకి, కడు
యుక్తిని వానిని బట్టనెంచి తా
నల్లె నుపాయ; మట్టి సమ
యోచితి యెప్పుడె సెట్టిబిడ్డకున్?

తే. "7వేఁకటివి గాన నడిగెద వేడ్కమీర,
నీకు నేశిశు విష్టమా నాకుఁ జెపుమ."
యనిన, ననుసిగ్గు నెలనగ వానసమునఁ
దోఁప, 'స్త్రీశిశు' వనియెఁ దత్తోయజా,

ఆ. "ఆఁడుశిశు వనంగ నాడె నీనోరెట్టు?"
లంచు నుగ్రచిత్తుఁడై 8కిరాటుఁ
డతివఁ దిట్టి కొట్టె; నది పెద్దపెట్టున
నమ్మలింపఁ, జేరి రూరివారు.

ఆ. "అతివఁ గొట్టె నేల?" యని నిష్ఠురంబుగా
నడుగుజనులఁ జూచి, యటుక చూపి,
"అచట వెలసియున్న యావేల్పు నడుగుఁడీ,
పలుకు నిజ" మటంచుఁ, బలికె సెట్టి.

ఆ. ఉలుకుచున్న దొంగ నూరివారెల్లరు
నంతఁ దీరఁ దన్ని బందిఁ జేసి,
వణిజపుత్త్రయుక్తి వర్ణించు చేఁగిరి;
యుక్తి కేది యసాధ్య మోర్వియందు?

—స్వకీయము.

1 శయ్య 2 విచారము మఱచి గాఢముగా నిదురపోవుచున్నారో అని 3 పెద్దగా అఱచి 4 దొంగ 5 సాహసించి 6 భయపడి 7 గర్భిణివి 8 కోమటివాఁడు.

ప్రశ్నలు:— (1) సెట్టి దొంగజాడ నెట్లు కనిపట్టెను?
(2) పెద్దగా నెందుకు అఱవలేదు?
(3) దొంగ నెట్లుపట్టనిశ్చయించెను?
(4) సెట్టి ఎట్లు దొంగను పట్టెను?

## 18 కుర్కుర నీచత్వము

సీ. విను మొక్కయితిహాస,— మనుపమం బగుతపం
బునఁ బేర్చువాఁ డొక్కముని వరేణ్యు
నాశ్రమంబునఁ దద్దయావిశేషంబున
నఖిలజంతువులును నచట నచట

వసియించి సుఖముండు; వానిలో నొక్క 2కు
క్కుర మెప్డు భక్తిమైఁ గొలిచి తిరుగు;
నమ్ముని మెలఁగినయచట నెల్లను దాను
వర్తింప, నొక 3దుష్ప్ వైరమెత్తి

తే. కఱవ వచ్చిన నమ్మునికడకుఁ బాఱు
తెంచె; నాకుక్క నాతఁడు దీప్తరూప
మైన దుష్పఁగాఁ జేసిన నది గడంగి
కవియ, భయమంది పాఱె మున్కవియు దుష్ప

సీ. అట్లు బెబ్బులి వచ్చి యడరినఁ, బెబ్బులిఁ
గాఁ జేసి గెలిపించెఁ గరుణ మెఱయ;
నొకమత్తకరిఁ జూచి యోటమై నొదిఁగిన,
నుద్ధతకరిఁ జేసియొసఁగె జయము;
సింహంబునకు భీతిఁ జెంది పార్తెంచిన,
ఘనసింహముగఁ జేసి గర్వమిచ్చె;
శరభంబుధాటికిఁ 4జకిత మైన, 5నుదగ్ర
శరభంబుఁ జేసి యుత్సాహిఁ జేసె;

తే. నిట్లు దివసక్రమంబున నెక్కుడైన
6 'సత్త్వమును జేయఁగాఁ, గుక్క శరభభావ
మండితం బయి తిరుగుచునుండి, 7పూర్వ
వాసనానీచ మగుమనోవర్తనమున,

ఇట్లని విచారించె,—

క. "ననుఁ గని యొంచుసత్త్వము మ
నంబున బెగ్గలి పాఱునప్డు శి
మ్మునివరుఁ, డిట్లిపోలెఁ గృప
రిమొక్కులమై, శరభంబుగాఁగఁ జే
యునొ తగ దాని? నట్లయిన
నుద్ధతి నాకుఁ జరింప లేదు; గా
వున నితనిన్ వధింతు వెర
వున్ బలమున్ సరి నుల్లసిల్లఁగన్". ర

తే. అనువిచారంబు దివ్యబోధాఢ్యుఁడైన
యమ్మునీశ్వరుఁ డెఱిఁగి, "యీయథమజాతి
యున్నతస్థితి యెఱుఁగునే? మున్నపోలెఁ
గుక్కయయి యుండుఁగా;" కన్నఁ, గుక్కయయ్యె.

—శాంతిపర్వము III

1. పెంపొందువాఁడు, 2. కుక్క, 3. చిఱుతపులి, 4. భయపడిన, 5. భయంకరమైన, 6. మృగము, 7. తొంటిసంస్కారముచే నీచమైన చిత్తవృత్తిచేత, 8. మిక్కుటమై, 9. జ్ఞానముచే గొప్పవాఁడైన.

ప్రశ్నలు:—(1) కుక్క ఎట్లెట్లు శరభమయ్యెను?
(2) దానిపూర్వంపు నీచత్వముపోయెనా?
(3) అది ఏమనుకొనెను?
(4) ముని దానితలంపు ఎట్లెఱింగెను?
(5) అతఁ డేమిచేసెను?

## 19 పాటకు మాట చెల్లు

నరాజుఁజేరి గాయకుం డొకరుండు
జంత్రగాత్రములను జాలఁబ్రజ్ఞ

నెఱసి జేసినదిని మెప్పించి కడుఁగొప్ప
[1]పారితోషికంబు కోరియుండె.

ఆ. ఆదరించి యపుడె యాతేఁడు కోశాధి
కారిఁ బిలిచి, "యితఁడు కోరినంత
కనక మిచ్చి పంపు" మని ఘనంబుగఁ బల్కె;
గాయకుండు కడు సుఖంబు నొందె.

క. ఆశగొని చేరి తోష్ట్రఁ
గోశాధ్యక్షుఁ గడు వేఁడుకొని, యతఁడు బదుల్
లేశమును బలుకకున్న, న
రేశునికడఁ జేరి మొఱ్ఱయిడ, నాతేఁడుఙ్.

క. "అడిగెద వింతటిస్వర్ణం
బడియాసను, బుద్ధిమాలి; [2]అప్రతిఫల మీా
నొడఁబడువాఁ డుండునె? మూ
ర్ఖుఁడ, యిఁకఁ జాలింపు నీదుకోరికిబికి కోర్కెల్.

ఆ. పాటఁ బాడి నీకుఁ బరమసంతోషంబు
గలుగఁ జేసి తంచుఁ బలుకుదేమొ?
మంచిమాటలాడి మది నీకుఁ దనియఁగాఁ?
జేయలేదె నేను? చెల్లుపోదె?"

క. అని రాజు వలుకుమాటకు
మనమునఁ గుములుచునె, బదులుమాట యొకండే
ననఁదోఁపక గాయకుఁడా
[4]ఘనకృపణస్వాంతు వీడి గ్రక్కున నరిగెఙ్.

—సంకీయః

1. బహుమానము 2. ప్రతిఫలము లేక 3. సరిగాని 4. వెను లోఁగిని.

ప్రశ్నలు :— (1) గాయకుఁడు రాజు నెట్లు మెప్పించెను?
(2) రాజు అతని కేమి పారితోషికము ఇమ్మనెను?
(3) కోశాధికారి ఏల బహుమతి ఇయ్యలేదు?
(4) రాజు గాయకునితో నేమి పలికెను?

## 20 చోరరాక్షసుల కథ

చ. ఘన మగునగ్రహారమునఁ
గర్మవిదుం డొకబ్రాహ్మణుండు పా
వనచరితుండు గోవులఁ బ్ర
వర్ధన మొందఁగ రెంటి మేపఁగాఁ
గనుఁగొని తాఁ బ్రమోదమునఁ
గైకొనఁగాఁ దఱి వేచి యుండు [1]ము
[2]చ్చనిశము ; నొక్కనాఁ డొకమ
హానిశి నొక్కఁడుఁ బోవుచుండఁగన్,

సీ. ఎదురుగా నొక్కరుఁ డేఁగుదెంచిన, వానిఁ
దరలక చోరుండు దాఁకి బెదరి ;
"యెవ్వండ?" వనుటయు, "నే బ్రహ్మరాక్షసు
డను ; నన్నుఁ దాఁకినఘనుఁడ వైన
నీ వెవ్వఁ?" డనుటయు, "నే ముచ్చుఁ, బోఁ;" మ్మన,
"నింతప్రొద్దెచ్చటి కేఁగ?" దనిన

"ఈపురిలోన మహీసురోత్తముధేను
వులు రెండు మంచివి గలుగఁ జూచి,
సీ. యపహరించుకొఱకు నరిగెద నే;" నన్న
"నేను నతనిఁ బట్టి నిపుడు వత్తు,
ర;" మ్మటంచుఁ గదలి బ్రహ్మరాక్షసుఁడును
నతఁడు నంతఁ గూడి యతనిగృహము,

వ. కలయంబోయి యమ్మహీదేవు గృహద్వారంబునొద్దనిలిచి
చోరునిం జూచి బ్రహ్మరాక్షసుం డిట్లనియె,— 3

గీ. "ఏను మున్న పోయి యీయింటివిప్రునిఁ
బట్టఁ భుక్తి నాకుఁ బెట్టఁ జూచి
పిదపనీవు గద్దిసి మొదవులఁ దోలుకొ;"
మ్మనినఁ జోరుఁడనియె నాగ్రహమున,—

క. "చోరఁబడి గోయుగముంగొని
సరగున నే నూరు వెడలి చనినంతట భూ
సురు నీవు పట్టు" మని-య
య్యిరువురు గలహింపఁ జొచ్చి 4రెలుఁగెత్తియటఁ.

వ. ఆకలకలంబునకు మేలుకాంచి,

తె. విని మహీసురవర్యుండు వితతమంత్ర
బలముగను బ్రహ్మరాక్షసుఁ బాఱఁదోలి
నంత, నటమున్న చోరుండు నరిగెఁ; గానఁ,
బోసఁగ 5నహితులు తమలోనఁ బోర మేలు.

—పంచతంత్రము.

1. దొంగ, 2. అనిశము=ఎల్లప్పుడు. 3. బ్రాహ్మణుని, 4. గొంతెత్తి, 5. శత్రువులు.

ప్రశ్నలు:—(1) చోరరాక్షసులు బ్రాహ్మణునింటికి ఏల పోయిరి?
(2) వారికి ఏల కలహము పుట్టెను?
(3) దానిఫలమేమి?
(4) బ్రాహ్మణుఁడు వారల నెట్లు దండించెను?
(5) నీతియేమి?

## 21 ఋణవిముక్తి

తే. ద్రవిడరాజాధిరాజునాస్థానియందు
[1]నర్మసఖుఁడు వసంతకనాముఁడుండుఁ;
జతురవాగ్వర్తనముల నాత్క్ష్మాతలేశు
వివిధరీతుల సంతోషపెట్టు నతఁడు.

ఆ. ఎటులొ కాని తేని కేడువేల్ [2]నిష్కంబు
లప్పువడియె నతఁడు; హాస్యసచివుఁ
డెంత వేఁడుకొన్నఁ నెంతలోభియొ ఱేఁడు,
త్రోసివేయఁడౌర కాసుఁగూడ!

క. [3]అధమర్ణత్వవిముక్తికి
విధ మొక్కటి గానరాక విహ్వలపడి, 'నే
నధిపతి వంచించి [4]ఋణో
దధి దాటుదు' నం చతండు ధైర్యముపూనెన్.

సీ. బ్రాహ్మణుఁ డొకనాఁడు సంజప్రొద్దున 5వీట
6వాహ్యాళి యేఁగుచు 7వాడ నొకట
8వాహకోఢంబైన బ్రాహ్మణశవ మొండు
పొడగాంచి తద్వార్త యడిగి, యచటి
జనములు చెప్ప వసంతకుశవముగా
నెఱిఁగి తా వగచుచు నిట్టు లనియె
“సఖుఁడ, వసంతకా, 9స్వర్వాటి కేఁగితే;
నీ కేమిప్రియ మింక నే నొనర్తు?

తే. నీవు నా కచ్చువలసిననిష్కరాశిఁ
ద్రోసివేసితి; ఋణవిముక్తుఁడవుగమ్ము”
యనినయాలోన నెల్లర కద్భుతంబు
ననయఁగా లేచి కూర్చుండె నర్మసఖుఁడు.

క. “దేవా, నీవాగమృతము
తో వచ్చెను బ్రాణసమితి; దుర్భరఋణముక్
మీవరదయనే తీఱెను;
భూవరులును బ్రహ్మ తలఁపఁ బొనరని దున్నే?”

—స్వకీయము

1. వేడుక చెలికాఁడు, 2 వరహాలు, 3. అప్పుతీర్చుటకు, 4. అప్పుసముద్రము, 5. నగరమునందు, 6. సంచారమున, 7. వీథిలో, 8. పీనుఁగు మోయువారిచే మోయఁబడునట్టి, 9. స్వర్గపురమునకు.

ప్రశ్నలు :—(1) ధర్మశర్ముఁడు అప్పుతీర్చుటకై ఏల దిగులుపడెను? ఏమి నిశ్చయించెను?

(2) అప్పుతీర్చుటకు వసంతకుఁ డేమిసాహసము చేసెను? అది ఎట్లు ఫలించెను?

(3) వసంతకుఁడు రాజుతో నేమి పలికెను?

## 22 దీర్ఘదర్శిముఖ్యుల కథ

వ. దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును నను మత్స్యంబులు మూఁడు జలచరబహుళంబగు నొక్క యేటిమడువునఁ దమలోనఁ బొందు గలిగియుండు; వేసవి యొచ్చిన దీర్ఘదర్శి దక్కటి రెంటినిం గూడం బిలిచి,— ౧

క. "మడు వింకఁగఁ బాఱెడు; నీ
[1]ఱెడ త్రెవ్విన, నొండుసోటి కేఁగఁగరా; దె
ప్పుడు నింకనినీళ్లు గల
మడువునకుం బోవ వలదె మన కిట్టియెడన్?"

తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె, "నేది
ప్రాప్తమయ్యె, నక్కార్యంబుభంగి నెఱిఁగి
యప్పటికిఁ దగినట్లు సేయంగ వలయు
మానితోపాయవృత్తి, నేమఱుట లేక." ౩

వ. అనిన నయ్యిరుదెఱంగుల పలుకులు విని దీర్ఘసూత్రుం డిట్లనియె, ౪

క. [2]"జడనిధిచందంబున ని
మ్మడుపు వొప్పుగఁ, నిప్పు డేల మాఁడిన దిమ్మై
[3]నడచిపడఁ? రిత్తనెవ్వఁగ
లుడుగుఁడు, మఱిచూచుకొంద మొయ్యనఁ [4]దఱితోఁ;"

క. అనుటయు, "నిది [5]కర్జము గా;"
దని పల్కుచు దీర్ఘదర్శి యంబు[6]స్రోతో
జనితాభయ మగుపథమునఁ
జని చొచ్చెం బెద్దమడువు సమ్మదలీలన్. ౬

వ. తక్కిన రెండును నంద నిలిచె. కొన్ని దినంబులకు మడుఁ గింకఁ బాఱ జాలరులువచ్చి [7]యెత్తెల వైచి మత్స్యంబు లం బట్ట సమకట్టినఁ, బ్రాప్తకాలజ్ఞుఁడు,— ౭

క. "ఇం దొకత్రాడు గఱచి యే
నొందంగా గ్రుచ్చినట్లయుండెద; వీరి
క్రందుకొనుట మానంగ న
మందత నదియెడల విడిచి మడువు దఱిసెదన్." ౮

వ. అని యట్లు చేసి తప్పించికొనియె; మఱి, ౯

క. ముట్టఁబడిదీర్ఘ సూత్రుం
డిట్టట్టరుగఁగ నుపాయ మేది, యొకనిచేఁ
బట్టువడెఁ, దనదు డెందము
పట్టు వదలి చకితవికల భావేంద్రియుఁడై ౧౦

—శాంతిపర్వము, 3 ఆశ్వా.

'దీర్ఘదర్శి' చాల ముందు చూపుగలవాఁడు. 'ప్రాప్తకాలజ్ఞుఁడు'— అప్పటికాలమెఱిఁగినవాఁడు; 'దీర్ఘసూత్రుఁడు' = అలసుఁడు. వీరలకు క్రమముగా అనాగతవిధాత, ప్రత్యుత్పన్నమతి, యద్భవిష్యుఁడు అని నామాంతరములు. 1. విచ్చిన్నమైనచో, 2. సముద్రము, 4. త్వరపడు, 4. వలసినప్పుడు, 5. కార్యము, 6. ప్రవాహము, 7. చేపలఁ బట్టెడి యడ్డువల.

ప్రశ్నలు:— (1) దీర్ఘదర్శి కడమమత్స్యములతో నేమిపలికెను?

(2) వా రేమి బదులుపల్కిరి?

(3) దీర్ఘదర్శి ఏమి చేసెను?

(4) ప్రాప్తకాలజ్ఞునకు వచ్చిన యిక్కట్టేమి?

(5) దీర్ఘసూత్రుఁ డెట్లు ఇడుమఁ బడెను?

(6) నీతిఏమి?

## 23 రంతిదేవుని చరిత్రము

సీ. రంతిదేవుం డను రాజోత్తముఁడు మహా

దాతృత్వకీర్తితోఁ దనరుచుండు;

నారాజు దనసంచితార్థంబు లన్నియు

నెడపక దీనుల కిచ్చి యిచ్చి

సకుటుంబుఁడై ధైర్యసంయుతుం డై పేద

యై కూడు నీరు లే, కధమవృత్తి

5ం దేని నలువదియెనిమిదిదివసముల్

చరియింప, నొక [1]దివసంబు రేపు

ఆ. నెయ్యి, పాయసంబు నీరును గలిగిన,
బహుకుటుంబ భారభయముతోడ
నలసి, 2నీరువట్టు నాఁకలియును మిక్కి
లొదవఁ జూచి కుడువ నుత్సహించె.

వ. అయ్యవసరంబున,

సీ. అతిథి భూసురుఁ డొక్కఁ డాహార మడిగినఁ
గడపక ప్రియముతో గారవించి,
"హరి సమర్పణ;" మంచు నన్నంబులో సగ
మిచ్చిన, భుజియించి యేఁగె నాతఁ;
డంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి
పొడసూప లేదనఁ బోక, తనకు
నున్నయన్నములోన నొకభాగ మిచ్చిన,
సంతుష్టుఁడై వాఁడు సనిన వెనుకఁ,

ఆ. గుక్క 3గమియఁ దాను నొక్కఁ డే తేర నా
యన్న శేష మిచ్చి, 4సన్నయంబు
లాడి మ్రొక్కి పంప, నోడక చండాలుఁ
డొక్కఁ డరుగుదెంచి, చక్కనిలిచి,

క. "హీనుఁడఁ జండాలుండను;
మానవకులనాథ, దప్పి మానద; యవలం
బో నేర; నీకుఁ జిక్కిన
పానీయము నాకుఁ బోసి పంపంగదవే."

వ. అనిన వానిదీనాలాపంబులకుఁ గరుణించి

ఉ. "అన్నము లేదు; కొన్ని మధు
రాంబువు లున్నవి, త్రావు మన్న; ర
మ్మన్న; శరీరధారులకు
నాపద వచ్చిన, వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సు
ఖంబులు సేయుట కన్న నొండు మే
లున్న దె? నాకు దిక్కు పుర
షోత్తముఁ డొక్కఁడె సుమ్ము, [5]పుల్కసా"

*క. అని కనికర మిగురొత్తఁగఁ
దన కున్న జలంబుఁ బోసెఁ దత్పాత్రమునన్
వనజాసనాదు లచ్చటఁ
గనుపట్టి నృపాలు కిడఁగఁ [6]గైవల్యంబున్. ౭

—భాగవతము IX

1. (ఒక) నాఁటి యుదయము, 2. దప్పి, 3. గుంపు, 4. మంచి నీతులు, 5. చండాలుఁడా, 6. మోక్షము.

ప్రశ్నలు :—(1) రంతిదేవుఁడు ఏల పేదయయ్యెను?
(2) అతని యతిథు లెవరు?
(3) వారి కెట్లు అతఁ డాతిథ్యమిచ్చెను?
(4) అతని కెట్లు కైవల్యము సిద్ధించెను?

## 24 శంఖలిఖితోపాఖ్యానము

క. మును శంఖుండును లిఖితుం
డన నిరువురు విప్రవర్యు లన్నయుఁ, దమ్ముం
డును గలరు బాహుదాతీ
రనివాసులు ధర్మతత్పరమనోవృత్తుల్.

సీ. వారి యాశ్రమముల భూరిపుష్పఫలాభి
వృద్ధి నొప్పారెడి వివిధభూరు
హంబులు గల; వొకయపుడు శంఖుండు గృ
హమ్మున లేకుండ, ననుజుఁ డచటి
కరిగి యం దొకత్రోవ [1]నారఁ బండినపండ్ల
గని వేడ్కమైఁ గోసికొనితినంగ,
నయ్యన్న యేతెంచి, "యనుజ, యీఫలము లె
క్కడియవి? చెప్పు;" నావుడు వినీతిఁ

తే. బ్రణతుఁడై, "యిచ్చటివి;" యని పలికె లిఖితుఁ;
డాతఁ, "డనుమతి లేక కోయంగఁ దగు నె?
చ్రుచ్చిమియ కాదె యది? పాప మచ్చుపడియె;
నృపతిచే దండితుండవై శిక్షఁగొనుము."

*మ. అన, సుద్యుమ్న సమాఖ్య నొప్పునృపు ధ
ర్మాత్ముఁ గా వడిఁ జేరి, "యో
మనుజేంద్రా, గురునాజ్ఞ లేక ఫలముల్
మందుండ నై గోసి నేఁ

దిని బ్రము చ్చెతిని; యుక్తదండవిధిచే
నిర్ముక్తపాపాత్ముఁ గాఁ
గ ననుం జేసి, [4]కృతాంతదండన విమో
క్షశ్రీయుతుం జేయవే.''

వ. అని లిఖితుండు పలుమఱు వేఁడుకొనఁగా,

తే. ధర్మ [5]వైకల్యపాపంబు దన్నుఁ బొరయ
కుండ నిశ్చయ మొనరించి, దండనిపుణుఁ
డైన యారాజు లిఖితుని హస్తయుగ్మ
[6]కర్తనంబున దండితుఁగా నొనర్చె.

వ. అంత లిఖితుండు రాజును దీవించి మగిడి చని శంఖునిం గని నికృత్తంబులైనహస్తంబులు సూపి, "సమ్యగను భూతదండుండ నైతి;" ననిన నాతండు ప్రీతుండై చెంగటినదిం గ్రుంకిరమ్మనిన,

తే. బాహుదానదియం [7]దవగాహనంబు
సేయఁ బ్రభవించె నాతనిచేతు లపుడ!
విస్మయఁ బంది యతఁడు వేవేగ వచ్చె
నన్నపాలికి, నతఁడు బ్రహర్ష మొంద.

శాంతిపర్వము

1. పూర్తిగ, 2. దొంగతనమే, 3. నివృత్తిచేసికొనుము, 4. యమదండన, 5. విచ్ఛేదమువలని, 6. కత్తెరించుటచే, 7. స్నానము,

ప్రశ్నలు :— (1) శిఖితుఁ డొనర్చిన పాపమేమి?
(2) శంఖుఁడు విధించిన ప్రాయశ్చిత్త మేమి?
(3) పాపికి యమదండన తప్పు నుపాయమేమి?
(4) రాజునకు ఎప్పుడు ధర్మవైకల్యపాపము వచ్చును
(5) ఏటికి 'బాహుద' అని పేరు ఏల కలిగెను?

## 25 రిత్తచలము

క. ధరణిపయి లాటనరపతి
పురిఁ దేనియ నమ్మికొనుటకు బోయలపల్లెం
జరియించుచుండువాఁ డొక
పురుషుం డది యొక్క కలశమునఁ గొని కడఁకన్,

వ. అరిగి యానగరంబున నొకసన్నపు వీథియందు,

ఉ. తేనియకుండ మోచుకొని
దిక్కులు నాలుగు [1]బిక్కచూడ్కి నే
దేనియుఁ జూచుకొంచు, నొక
[2]యేనిక కట్టెదుటన్ మదాంధమై
రా నచటం దొలంగెడుపు
రంబుజనంబును జూచి భీతుఁడై
దానును నుత్తరించుచుఁ బ
దంబులు తొట్రుపడంగఁ బాఱుచున్.

నగరంగొల్లనివార లొక్కెడెసయై
నానాయుధోపేతులై
తెగి భూపాలకసేనఁ దాఁకిరి మహో
ద్రేకంబుతో నార్చుచున్.

ఉ. రెండు తెఱంగు మూఁకలును
రిత్తకు రిత్త చలంబు పెంపునన్
భండన ముగ్రభంగుల నొ
నర్పఁగఁ బెక్కులు ద్రెళ్ళఁ బీనుఁగుల్
కండలుఁ ద్రేవులుం గలసి
కాలువలై యెసలారె నెత్తురుల్
కుండలచారుమస్తములు
గుప్పలుగట్టెఁ బురంబువీథులన్.

—కేయూరబాహు II.

1. పేదచూపు, 2. ఏనుఁగు, 3. మోఁకతిల్లఁబడఁ బరుగెత్తఁగా, 4. పాలెప్రురుగు, 5. పిల్లి సొంతకాఁడు, 6. రాజగృహంపు, 7. వీథి జనులు, 8. వెంబడినే.

ప్రశ్నలు:— (1) తేనెయమ్మువానికి ఏమి యిక్కట్టు కలిగెను?
(2) తేనెబొట్టుచే నెట్లు మహాకలహము ఉప్పతిల్లెను?
(3) కలహముచే నెట్టియనర్థము వాటిల్లెను?
(4) 'రిత్తచలము' అను టేల?

## 26 నిత్యసంతోషి

తే. అద్భుతోన్నత రమ్య హర్మ్యం బొకండు
కట్టి ధర్మాత్ముఁ డైనమహాఘనుండు దాని
ద్వారముఖమున నిల్పెను దానశాస
నమ్ముఁ, దద్దానమహిమ లోకమ్ము పొగడ.

తే. “నిత్యసంతోషి యని తాను నిక్కమౌ ప్ర
మాణమును జూపుఁ దొల్త నేమనుజుఁ, డతని
కిత్తు నీమేడ భక్తి తళ్కొత్త, నతని
[1]కన్వయానుక్రమస్వామ్య మధిగమింప.”

సీ. అని యిట్టు పలుకునా ఘనదానశాసనా
ర్థము చూచి యొకనాఁడు సమధికప్ర
మోదంబుతో నొక్క పురుషుఁ డేతేరి యా
దాతతో నిట్లనె, “దానవీర,
హర్మ్యప్రతిగ్రహణార్థమై వచ్చితి;
నిత్యసంతోషిని; సత్య; మట్లు
శపథంబు చేసెద; సౌధంబు దయసేయు”
మని తన్ను వేఁడెడునతని జూచి

తే. యనియె నవ్వుచు దాఁడు—, “నీ వన్నయట్లు
నిత్యసంతోషి వౌటయే నిక్కమేని,
హర్మ్య మర్థించు టది యెట్టు లనువుపడును?
నిత్యసంతోషి [2]యాచ్ఞాభినీచుఁ డగునె?

క. ఈ వేఁడుకోలుచేతనె
యీవాశావిష్టుఁ డవుటయెప్పుడుఁగాదే?
ఈవరహర్మ్యము నీ కెటు
లీవచ్చును? చెప్పుఁ;'' మని నరేశుఁడు పల్కన్,

క. ఇవ్విధిపల్కును నరపతి
యెవ్వఁడు వచ్చినను వేఁడ; నెన్నఁడుగానీ
యవ్వరహర్మ్య 3వితీర్ణికి
రవ్వంతయు నవసరంబు రాదయ్యెఁజుఁడీ!

[స్వకీయము.]

1. వంశపారంపర్యముగ ననుభవించు నధికారముచెందునట్లు, 2. యాచనచే నధమదశకుఁ దార్పఁబడినవాఁ డగునా? 3. దానమునకు.

ప్రశ్నలు:— [1] మాగధుఁ డేమి దానశాసనము వేయించెను?
[2] దానిని ప్రతిగ్రహింపవచ్చినవాఁ డేమిపలికెను?
[3] తా నేమి బదులుపలికెను?
[4] రాజు దాతృత్వస్వభావము ఎట్లు తేలెను?

## 27 చౌర్యచాతుర్యము

తే. అందచందంబులన్ 1గంతుఁ డనఁగ బొల్చు
రాకొమరుఁ డొండు దేశయాత్రావశమునఁ,
గాంచికాపురిఁ జేరి సౌఖ్యప్రసిద్ధి
వెలయు నొక 2చంద్రశాలలో విడిదిచేసె.

తే. [3]రాజకాధికసంకుల రమ్యమైన
హర్మ్యతలమున గీత నృత్యప్రసక్తి
నెలయునృపసూను దరసి [4]విచిత్రమునకుఁ
[5]జేరి యిటువల్కె నొకచిత్రకారుఁ డపుడు.

తే. "మారసుందర, నీపయి మనసు గొన్న
యుత్పలాక్షి యొకర్తుక [6]యొయ్య నీదు
చిత్రమును వ్రాసి తెమ్మని చెప్పినన్ను
బనిచియున్నది; నీయాన" యనియె నతఁడు.

సీ. మది నుబ్బి యాతఁ డమ్మదిరాక్షి మక్కువ
మన్నింపఁగా నెంచి, మాటచెప్ప,
[7]రమణీయ సన్నివేశమున రాసుతు వ్రాయ
నిటు లిట్టు లని దిద్ది యింపుగులుక
నిలిపి, "నీ విట్టుల నిశ్చలంబుగ నొక్క
యరముహూర్తం బుండ నవధరింపు"
మని పల్కి, యాశిల్పి యతికౌశలస్ఫూర్తిఁ
[8]దూలిక నాళిలేఖ్యలీల నెఱపి,

తే. "ఇప్పటికి నాకు సెలవీ నరేశపుత్త్ర,
రేపుమాపట నీవు నీప్రేయసియును
గలసి చిత్రంబు దర్శింతురుగాని," యనుచుఁ
జిత్రకారుండు మ్రొక్కి తా సెలవుగొనియె.

ఆ. అతఁడు పోవఁగానె నధిపసూనుఁడు జేబి
లోని ముల్లెసంచి గానకెంతొ
వ్యాకులమున నూఁడువాడల వెదికించెఁ;
జిత్రకారుఁ డెందుఁ జిక్కఁడయ్యె. ౫

క. "బళిరా చౌర్యచమత్కృతి!
యిల నింతటి 10పగటిచుక్క యెసఁగునె?" యంచుఁ
బలికిరి చోరుని జనములు;
పలుకక యెటపోయెఁ బోయెఁ బార్థివసుతుఁడున్. ౬

—స్వకీయము.

1. మన్మథుఁడు, 2. పైమేడలో, 3. రాజులసమూహములతో క్రిక్కిరిసి రమ్యమైన, 4. ఏకాంతమునకు, 5. పిలిచి, 6. త్వరగా, 7. రమణీయమైన యునికిలో, 8. కుంచెతో, 9. చిత్రలేఖనవిలాసము, 10. పగటిదొంగ.

ప్రశ్నలు:—(1) చిత్రకారుఁడు రాకొమరుని ఏకాంతమునకు ఏల పిలిచెను?

(2) అతఁడేమి విన్నవించెను?

(3) రాజపుత్రుఁ డది విని ఏమనెను?

(4) చిత్రకారుఁ డేమిచేసెను? ఏమిచెప్పి సెలవుగైకొనెను?

(5) చిత్రకారుని యథార్థవృత్తాంత మేమి? అతఁ డెప్పుడు ఎట్లు ముల్లెసంచి హరించెను?

(6) జను లతని గూర్చి ఏమిపలికిరి?

## 28 'పాముకన్న నరుఁడు పాతకుండు'

. శ్రీకర మగువింధ్యాటవి
నేకలుఁ డనుబోయ తోఁట [1]యీరమున [2]మహా
నోకహముం బెగనఱకఁగ,
నాకోటరసీమ నొక్క యహిపతి వెడలెన్.

. వెడలి, "నేను నిలిచి విహరించుతా విది
వలదు; దీన నేమి కలదు నీకు?
నన్నుఁ గలసి బ్రతుకు; మెన్నఁడుఁ జేటు లే"
దనిన నెరఁగుపడుచు నట్లు తలఁగె.

. తలఁగిన, వానికి నహి తన
తలరత్నం బిచ్చి పుచ్చి తా నేఁగిన, ని
మ్ముల వాఁడు నేఁగి పురిలో
పల నొకవర్తకున కమ్మెఁ బది[4]గద్దెలకున్.

. అట మఱునాఁడు వచ్చిన, మ
హాభుజగేంద్రుఁడు గారవించి, "ని
న్నఁటిమణి యెంతకమ్మితి వ
నా?" యని, మూల్య మెఱుంగఁ దెల్ప, "
క్కట! పదివేల కమ్మక వి[5]
కల్పము చేసితి; వింతనుండి మి
క్కుటముగ నమ్మకొ" మ్మనుచుఁ
గ్రొత్త[6]ఫణామణి నిచ్చెవానికిన్.

46

క. తనయిల్లు గాచె నని యహి
ఆ. మనమునఁ బ్రియ మంది యిచ్చు మణులను దినముం
గొనిపోయి యమ్ముకొనుచును
ధనికుం డై, వాఁడు చెల్మి దప్పినబుద్ధిన్. ౫

ఆ. "దీని కెచటఁ గల్గు దివ్యరత్నంబులు?
క. దీని మొదలితావుఁ దెలియ వలయు;"
ననుచుఁ గోరి పోయి, యాపాముచనుజాడ
వట్టి యేఁగి-యొక్క-పుట్టఁ గనియె. ౬

క. కని తిరిగి పోయి, మఱునాఁ
డనలంబును గసపుమోపు హస్తంబులఁ గై
కొని వచ్చి తోఁట్టలోపలఁ
జొనిపె, భుజంగంబు మిడుకుచును మ్రడియంగన్

క్రిక్కి
7. ౹ క. జాల్మం డిటు గాలిచి యా
10. 7వల్మీకముఁ ద్రవ్వఁ జనిన, వడి విషములచే
పరిశ 8గుల్మాదులు 9దరికొనఁగా-
10నుల్ముకములభంగి4మఱియు నురగము లెగసెన్. ౭

ఆ. ఉరగకులము బోయఁ బొరిగొని శమియించె;
నట్లు గాకయున్న నదియుఁ 11దగవె?
పాము క్రూర మంద్రు ప్రాణులలో నెల్లఁ;
బాముకంటె నరుఁడు పాతకుండు!

—సింహాసనద్వాత్రింశిక I

1. పాపరిల్లు, 2. చెప్పఁగల్గు, 3. [illegible], 4. దరహాసము, 5. భ్రాంతితో నక్కింబడిరి, 6. పడగనున్నమణి-రత్నమణి 7. పుట్ట 8. తీఁగలగుంపు, 9. మందఁగా, 10. కొంచపులవలె, 11. కృతఘ్నుఁడా!

ప్రశ్నలు:—(1) పాము ఏకలునికి ఏల యుపకారము చేసెను? ఎట్లు ఉపకారము చేసెను?

(2) వాఁ డెట్లు ధనికుఁ డయ్యెను?

(3) వాఁ డేమని యాలోచించెను? ఏమిచేసెను?

(4) ఏమి ఘటిల్లెను?

(5) ఎట్లు పాముకంటె నరుఁడు పాతకుఁడు?

## 29 వైశ్యబాలిక ప్రజ్ఞ

క. కాంచీపురమున నొకరుఁడు
కాంచనగుప్తుఁ డనుబుద్ధిగలవైశ్యుఁ, డని
ర్వంచనుఁడు సుతున కరయం
బంచెం బరిణయముసేయ బాలిక నొకతెన్.

చ. పనిచినవారు వైశ్యకుల
బాలలఁ జూచుచు—నప్పురాంగణం
బున నొక[1] క్రేవ నొక్కరుఁడు
మూఁటెఁడు[2] ప్రాలకు నూనె సంతలోఁ
గొనఁ జనుదెంచి, 'బియ్యము
నకున్ సరి తైలము వోయు;' మన్న, నా
తనిపలు కెవ్వరున్ వినక
తద్దయు నవ్వుచు గేలి సేయుచున్;

క. "త్రాసేఁడుసూని కలకుం
తైలము మానెండు పురము కిదారణ గలుగన్,
త్రాలసరి తైల మడిగిన
జాలియ యగుఁ గాని, నీకుఁ జయము రే లబ్బున్?"

క. అని పలుక, మఱియు నడుగం
గని, యచ్చట నున్న వైశ్యకన్య యొకతె యా
తనిఁ జేరి, "కలదు నూనియ,
కొనియెదవే, రమ్ము త్రాలకును సరితెక్కన్?"

వ. అని పలికి, చేరవచ్చిన మూట దింపించి, బియ్యంబు లెస్స
యవిగాఁ జూచి, వానితో మఱియు ని ట్లనియె.

క. "త్రా లొక్కటఁ గొని, దానన
తైలము దిగువాఱఁ బోయుదానను; నీకుం
బోలినఁ, త్రాలం గొలువుము;
చాలము నీతోడఁ బిదప జగడము లాడన్.

వ. అనుపల్కులకు వాఁ డొడంబడుటయు,

ఆ. పళ్లెరంబుఁ దెచ్చి, పటుబుద్ధి బియ్యంబు
దానినిండఁ గొని, ముదంబుతోడ
నంద వోసెఁ దైల మంచులు దిగువాఱ;—
నవ్విధంబు మెచ్చ నావహింప.

క. చని కాంచనగుప్తునకున్
వినిపించిరి యతనివాడు వేగమ; యతఁ డం
దునఁ దద్బుద్ధి విశేషము
గొనియాడుచు, దానిఁ దనమకోడలిఁ జేసెన్. ౯

—కేయూరబాహు. I

1. పార్శ్వమున, 2. వియ్యాలునకు, 3. వెస.

ప్రశ్నలు :—1. సంతలో వియ్యపువాఁడు ఏమి వెల చెప్పెను? 2. ఆతని నెల్లరు ఎట్లు గేలిచేసిరి? 3. వైశ్యబాలిక ఎట్లు వియ్యము తీసికొనెను? 4. కాంచనగుప్తుఁడు దానిని ఏల కోడలిఁ జేసికొనెను?

## 30 గర్గుని బుద్ధిమాంద్యము

క. గర్గుఁ డనువిప్రుఁ డొకరుఁడు
దుర్గారాధనముఁ, బెక్కు [1]దోసఁగులఁ బడుచున్
దుర్గాటవిలోఁ జేయ, ని
రర్గళదయఁ దన్నుఁ జూచి యాయంబికయున్. ౧

క. వర మడుగు మనిన మ్రొక్కుచు
సరభస మగుకాంక్షతోడ, "సంజీవని [2]ని
ర్భరకరుణన్ నా కొసఁగుము
పరమేశ్వరి;" యనినఁ, గొన్ని పచ్చనియాకుల్. ౨

చ. తలఁచినమాత్ర నాత్మకర
తామరసంబున నున్నవాని, ని
మ్ములఁ [3]గృపసేసి; "వీనిరస
ముం బయిపైఁ జిలికింపఁగా శవ

40

ఆ. మ్న్యులకును బ్రాణముల్ గలిగి
ముందటి రూపమువచ్చి తేజముం
బలమును జెంది పూర్వగుణ
భంగిఁ జరించుట కల్గు నెల్లెడన్.

క. క. ఎండవు, తఱుఁగ;" వనుచు నిడి
చండిక పొడగానరాక చనుటయు, మదిలో
నిండిన సంతసమున వి
ప్రుం డవికోని, యాత్మపురముత్రోవ నొకరుఁడున్.

చ. చనునెడ, నిర్మనుష్య మగు
చక్కటి నప్పెనుకాన నెండిపో
యిన యొక 4పుండరీకశవ
క్రికి 7. 10. 5మీారము వెల్వల నున్నఁ, జేరఁగాఁ
జని తనకన్న యాపథము
పశ్ని శక్తి నిజంబుగఁ జూడ నెంచి, చే
త నలిపి యాకులం బసరు
దానిపయిం బిడిచెన్ గుబుద్ధియై.

చ. పిడిచిన, నేమి చెప్ప? నతి
భీకరదుస్సహపుండరీక మ
ప్పుడ తననిద్ర మేల్కనిన
పోలిక బ్రాఁగుచు బిట్టు లేచి, య

వ్వాడఁ గగువిప్రుఁ గూయిడఁగఁ
జేసి మృతుం బొనరించి మ్రింగె; మే
ల్వడసియు బుద్ధి చాలనియ
భాగ్యులు తత్ఫల మంద నేర్తురే! ౬

—కేయూర బాహు II.

1. ఇడుములు, 2. నిండు దయ, 3. ఇచ్చి, 4. పులి, 5. పొదరిల్లు.

ప్రశ్నలు:— (1) గర్గుఁడు చండిక నేమివరము కోరెను?
(2) ఆమె యేమి ప్రసాదించెను?
(3) గర్గుఁ డడవిలో వరమహిమ నెట్లు పరీక్షించెను?
(4) దానిచే నేమి యుప్పతిల్లెను?
(5) నీతి ఏమి?

## 31 సాపాయోపాయము

మ. ఒక 1కాసారతటంబునందు నోర పై
యున్నట్టివృక్షంబుపై
బకయుగ్మంబు వసింప, భార్య పురుషుం
బ్రార్థించె, "నోనాథ, య
ర్భకరాజిం దినిపోవుఁ గ్రిందఁగలస
ర్పం; బేపుమై నింక న
చ్చిక నే తెంచుఁ; బ్రసూతికాలమును వ
చ్చెం; గార్య మెట్లుండునో?"

వ. అనిన విని బకవిభుం డమ్మహీరుహంబుడిగ్గి కొలనితీరం
బున నిల్చి విచారించుసమయంబున నయ్యెడకు నొక్క

కళేబరంబు చనుదెంచి, "యిది యేమి దుఃఖాకులుండ
వై యున్నవాఁడ?" వనిన, నబ్బకం బిట్లనియె,

ఉ. "నాకులకాంత గర్భ మయి
నందనులం గనునంతలోన, తిద
ర్వీకర మేఁగుదెంచి తిని
వేగమ పోయెడు; నెల్లి నేఁటిలో
నాకలకంఠి వెండియును
నర్భకులం గనువేళ గాన, నే
నాకులతం దలంకెద, మ
దాత్మకు నేమియుఁ దోఁప కుండఁగన్."

వ. అనినఁ గర్కటకంబు నీకుం దగినయుపాయంబు చెప్పెద
విను మని యిట్లనియె,-

తే. "నకులవివరంబునందుండి నాగవిభుని
యునికిదాఁకను మీనంబు నొకటి నొకటి
వైచుకొని పోవ, నాముంగి వరుసఁ దినుచుఁ
బాముఁ జంపును; దీని కుపాయ మిదియె."

వ. అన విని బకం బట్లు చేసిన,

ఆ. కవుచుగాలి పాఱ, గవిఁ బాసి వెలువడి
వరుస మీలఁ దినుచు వచ్చి వచ్చి,
పాముఁ జంపి, పాదపముఁ బ్రాఁకి బకశిశు
ప్రకరభుక్తిఁ దనిసి, నకుల మరిగె.

—పంచతంత్రము—మిత్రభేదము.

40\. ఆ. క. 7. 10.

1. నరకప్పు, 2, 5. ఎండ్రకాయ, 3. పాము, 4. చేప, [illegible], 6. [illegible], 7. [illegible], 8. [illegible] [illegible].

ప్రశ్నలు:— (1) బకభార్య భర్తతో నేమి చెప్పెను?

(2) కుళీరకము ఏమి యాలోచన చెప్పెను?

(3) బకముచేసిన యుపాయముచే నేమి ఫలించెను?

(4) ఎట్టి యుపాయము మంచిది?

## 32 ఫలద్వయము

ద్విపద: "ముద్దులపాంచాల, ముదమున వినుము,—
జన్మవృక్షమునకుఁ జవి గలయట్టి
[1]పటుతరకమనీయ ఫలములు రెండు;
కెరలుభోగము లొండు, కీర్తి రెండవది;
తొలిపండు చవిచూచి తొలఁగు నొకండు;
మలుపండు చవిచూచి [2]మలఁగు నొకండు;
వీరలిద్దఱికిని భేదంబు హెచ్చు;
మొదటిఫలంబున మొనసెడురసము
క్షణభంగురం; బది సమసిపోఁ గలదు;
రెండవఫలమున రెక్కొనురసము
శాశ్వతం బౌచు—దిశల్ గలదాఁక,
[3]సవితృఁడు గలదాఁక, శశి గలదాఁక,
తారలు గలదాఁక, ధర గలదాఁక,

వారిధి గలదాఁక వరలుచు నుండుఁ;
ప్రకటఫలద్వయరసమును గ్రోలి
యనుభవించెడివార లరుదు భూస్థలిని;
4 ప్రాకృతజనములు ప్రథమఫలంబుఁ
బ్రాపించి సంతృప్తి వడయంగఁ గలరు;
వీరాంశమునఁ బుట్టి వెలయువారలకు
మొదటిఫలం బది ముఖ్యంబు గాదు;
మహిమాస్పదం బయి మనసు జ్వలింపఁ
బరగెత్తుదురు రెండవఫలంబుకొఱకు.
వెలఁదిరో, నీభర్త వీరశేఖరుఁడు,
కీర్తికాముకుఁ డయి 5 కేరుచున్నాఁడు;
నీవు భోగములపై 6 నిరతిఁ ద్యజించి
బాలచంద్రుని మనోభావం బెఱింగి,
భావిమానవుల హృద్భవనంబులందుఁ
7 దావకీనయశోలతావివర్ధనము
సేయంగఁ గోరుము; చెలువరో, యిపు
బాలచంద్రుని నాఁగఁబట్టంగ వలదు;" 30

అని యట్లు రేఖాంబ యానతీయంగ,
జననికిఁ దా నమస్కారంబు చేసి
వీరపత్నీమణి ధీర మాంచాల
భర్త వీడ్కొల్పంగ భక్తితో నేఁగె. 34

—పల్నాటివీరచరిత్ర.

1. చిక్కులియందపైన, 2. విడుగన, 3. సూర్యునకు 4. పాము
నేలు, 5. ఉత్సహించుచున్నానను, 6. క్రీతి, 7. సిద్ధన.

ప్రశ్నలు:— (1) జన్మవృత్తాంతముఁ గమనీయ ఫలమేమి?
(2) శ్లేష యనఁగ నేమి? ఏది ఏల వచ్చు?
(3) ఆ రెండుఫలములవృత్తాంతము రేఖాంబ పాంచాలకు
ఎందులకు వివరించినది?
(4) వీరపత్నీ ధర్మమేమి?

## 33 ముసలాఖ్యానము

క. ద్వారవతికిఁ గణ్వుండును
నారదమునివరుఁడు [1]గాధినందనుఁడును బెం
పారంగఁ దొల్లి వచ్చిరి
నారాయణుఁ జూచువేడ్క నరవరముఖ్యా.

సీ. చనుదెంచి పురవీథిఁ జనునవసరమున
[2]వృష్ణికుమారులు విధివశమున
మనముల నవినీతి జనియింప సాంబున
కంగనాలంకార మమరఁజేసి
కొనివచ్చి, యమ్మహామునివర్గమునకు [3]మి
థ్యావినయమున వందన మొనర్చి,
నిభృతులై, "కారుణ్యనియతాత్ములార, యీ
భామిని బభ్రునిభార్య; [4]ప్రజలఁ

తే. గనునె యిది?'' యని యడుగ నాయనలసదృశు,
లా తపోధనవర్యు లయ్యాగడమున
కాత్మలందుఁ గ్రోధానల మగ్గలముగ
నెలయ, నక్కుమారులతోడ నిట్టు లనిరి. 2

క. ''అంబుజనాభునికొడు కీ
సాంబుఁడు గను యాదవక్షయాపాదన రేక
ల్యం బగురోముసలము; మావచ
నంబున కన్యతంబు లేదు; నమ్ముఁడుమీరల్. 3

సీ. దామోదరుఁడు హలధరుఁడును దక్కంగ
యాదవు లెల్లను నమ్ముసలము
నద్భుతశక్తి గీటడఁగుదు; రబ్బల
దేవుండు దనదైనదేహ మధిక
నిష్ఠమై విడిచి వార్నిధిఁ బ్రవేశించు; భూ
శయ్య నుండంగ నాచక్రధరుని
జర యనురాక్షసి వెరపునఁ బట్టి క్ర
మించు; బొం;''డని చెప్పి, ''మెచ్చుగాదు

ఆ. మనము కృష్ణు నింకఁ గను;'' టనియెడిబుద్ధి
నమ్మహామునీంద్రు లపుడు మరలి
యాత్మవాసములకు నరిగిన; మఱునాఁడు
పుట్టె సాంబుగర్భమున ముసలము.

—మౌసలపర్వము

1. విశ్వామిత్రుఁడు, 2 [illegible]వృత్తులు, 3. [illegible]నయము, 4. సంతానము, 5. సమగ్రము, 6. [illegible].

ప్రశ్నలు:— (1) సాధువృత్తులు మునుల నేమి యడిగిరి? ఏల యడిగిరి?

(2) మునులు ఏమి పలికిరి?

(3) మునులు [illegible] పరీక్షించుచేనిక ఏల మరలిపోయిరి!

(4) మునులమాట ఎట్లు ఫలించెను?

(5) నీతి ఏమి?

## 34 శీలప్రాభవము

క. దనుజవిభుఁడు ప్రహ్లాదుం
[1]డనిమిషపతి రాజ్యలక్ష్మి నతులితశీలం
బునఁ గొని త్రైలోక్యంబును
దనకు వరగతంబు సేసె, ధర్మంబలరన్. ౧

వ. బృహస్పతి భార్గవులయుపదేశంబున దేవేంద్రుఁడు బ్రాహ్మణ
రూపంబునఁ బ్రహ్లాదునికి శిష్యవిధు లొనర్చు చుండి,
ఒకనాఁడతండు ప్రసన్నుండై తనకుఁద్రైలోక్య రాజ్యంబు
సంప్రాప్తం బైనశీలకారణంబు దెలియం జెప్పిన, ౨

క. "ఘనమగు నీశీలము నా
కనఘా, దయ నొసఁగవే; మహాత్ములఁ దగఁ జెం
దినవారు బ్రదుక వలదే?"
యని దీనత దోఁప ననిమిషాధిపుఁ డడిగెన్. 3

క. విని ప్రహ్లాదుఁడు గృప దన
మనమునఁ గదురంగ, "విప్రమాత్రుఁడు గాఁడీ
తని భంగిఁజూడ." నని వెఱ
వును బుట్టఁగ, నిచ్చె శీలముం బెం పెసఁగన్,

తే. పడసి యింద్రుండు శీలసంపన్నుఁ డగుచుఁ
జనియెఁ; దదనంతరంబ యద్దనుజవరుని
తనువునందుండి ²తేజిష్ఠతనువిలాసుఁ
డైనపురుషుండు వెడలిన, నతఁడు సూచి,

వ. "నీ వెవ్వండ;" వన, నప్పురుషుం "డేను శీలంబ, నీవిచ్చిన యవ్విప్రువాల వసియింపం జనియెద;" నని పోయెం; దద నంతరంబ క్రమంబునం దేజోమయరూపంబుల నలువురు నిజదేహంబుననుండి నిర్గమింప నద్దానవేశ్వరుం డడుగుడు

క. ఉత్తమధర్మము, సత్యము,
వృత్తంబు, బలంబు నగుట వినఁబడెఁ; ³బడిఁ, ద
చ్చిత్తము విషాద మంద, మ
హ త్తర మూర్తి యొకవారి జానన వెడలెన్. 8

క. వెడలిన, "నీ వెవ్వతె?" వని
యడిగిన, నాతనికి నిట్టులను దీనత న
ప్పడఁతి, "సిరి నేను; బల మె
క్కుడగు నరుగు నందుఁ బొవఁ గడఁగి వెడలితిన్;"ర

చ. అనిన భయంబు నొంది యతఁ
డాసతితోఁ, "బరమేశ్వరీ, మహా
వినయమతిన్ ¹దనుం గొలిచె
విప్రవరుం; డతఁ డెవ్వఁ?" డన్న, న
వ్వనిత, "సురాధినాథుఁడు, భవ
ద్ఘనరాజ్యవిభూతి యంతయుం
గొనుటకు నిన్నుఁ జెందె; నిటు
గోల్పడి తీవును నీదుశీలమున్.

వ. వినుము చెప్పెద. శీలంబున ధర్మంబు వెలయు; ధర్మంబున సత్యంబు దొరకొను; సత్యంబున వృత్తంబు సొప్పడు; వృత్తంబున బలంబు వాటిల్లు; బలంబున నేను గలుగుదుం; గావున సమస్తంబునకు మూలంబు శీలం;" బని చెప్పి సిరి పురందరుపాలికి ధర్మాదులతోడఁ గూడం జనియె. ౧౦

—శాంతిపర్వము III

1 ఇంద్రుని 2 మిక్కిలి తేజస్సుతోఁ గూడిన శరీరవిలాసము గల వాఁడు 3 వెంబడి 4 నన్ను.

ప్రశ్నలు:—(1) ప్రహ్లాదునకు త్రిలోకరాజ్యము దేని నిమిత్తమున వశమయ్యెను?
(2) ఇంద్రుఁడు తత్సంపాదనార్థ మేమి చేసెను?
(3) ప్రహ్లాదుఁడు ఏమిదానము చేసెను?
(4) శీలము నెట్టిపురుషుఁడుగా కవి వర్ణించెను?

(5) శీలముతోఁ గూడియుండు ధర్మములేవి? అవి ఇందెట్లు వర్ణితములు?

(6) వాని యన్యోన్య సంబంధము తేటపఱుపుము.

## 35 ప్రేమవిజయము

ఆ. "గట్టివాఁడ నంచు గరువంబుపెంపున
నెవని లెక్కసేయఁ [1]డినుముగాఁడు;
వానిసార మెల్ల వ్రక్కలింతు [3]మదీయ
నిశితధార నిపుడ నేర్పుమీఱ."

క. అని తాఁ బూని [2]కుఠారుఁడు
[4]ఘనదర్శనస్ఫూర్తి మెఱసెఁ; గాని [5]యయోవీ
రుని [6]నొంపలేక సుంతయుఁ
దనవాదర మొక్కవోవఁ దక్కెఁ గడంకన్

చ. తనసఖుఁ డౌకుఠారుఁ డిటు
దర్పముదూలినఁ, బండ్లుమీటుచున్
ఘన [7]కరపత్త్రిఁ "డిప్పు డరి
గర్వము చీల్చెద;" నంచు శత్రుభే
దమున [8]నేఁపుసూపెఁ; దన
దంతము లన్నియు నంతరించినన్
తాను ముఖభంగమై, మిగుల
భీతిలి తూలె ధరన్ [9]విసారుఁడై

ఆ. మొక్కవోయి [10]యరికి మోకరిల్లు కుఠారుఁ
[11]రదనభంగమైన [12]క్రకచుఁ జూచి
గేలిమాట లాడి, లీల శత్రువుఁ గెల్వ
[13]మోహరించి యేఁగె [14]ముద్గరుండు.

క. పోటరి యై యాసమ్మెట
వ్రేటు పయిన్ వ్రేటు గొట్టి పేర్చియుఁ, దుదిఁ
గోటివలె విడిసిపడియెను
ఆటోపం బెల్లఁ బోయి యల్లంత భువిన్.

క. ఈవిధి ముగ్గురుశూరులుఁ
జేవ చెడన్ [15]వహ్నికీల చెచ్చెరఁ బల్కన్,
"మీవీకలు వమ్మైనవి;
నావెర వీఁక నవధరింప నాణెము కాదే?"

సీ. అని పల్క, నవ్వీరు లపహాసించుచుఁ జూడ,
[16]ననలార్చి దరిఁ జేర్చి యినుముజోదుఁ
[17]గౌతుకస్ఫూర్తిమైఁ గౌఁగిటఁ గదియింపఁ,
గఠినత్వమెల్లను గరఁగిపోయి,
నీరయి యమ్మేటివీరుఁ డా లేమను
జతురానువర్తనసరణి నేలె;
నత్యద్భుతంబును ననితరసాధ్యంబు
నౌనాజయప్రకారాభ్యుదయముఁ

తే. గాంచి క్రకచాసురాదు లక్కజముపడిరి;
కనిరి [18]బోధంబుఁ వీడిరి గర్వమెల్లఁ;

క్రూరహింసల జయము చేకూఱదు; దెంత
క్రూరు నైనను బ్రేమ లోఁ గొనఁగ నౌను. ౮

—స్వకీయము

ఇందు ఇనుము, కుఠారము, కరపత్రము, ముద్గరము, వీనియందెల్ల పురుషత్వము ఆరోపింపఁబడినది. అనలార్చి (వహ్నికీల) స్త్రీగాఁ జెప్పఁ బడినది. 1. ఇనుము అను పేరటివాఁడు, 2. నా పదనైనవాదఅచేత, 3. గొడ్డలిగాఁడు, 4. గొప్పదైన చీల్పునట్టి యతిశయమును జూపెను 5. ఇనుముఁజోదు, 6. నొప్పింపలేక, 7. అంపము, 8 శౌర్యము, 9. చేఁ చెడినవాఁడై, 10. నమస్కరించి, 11. పండ్లుపోయిన, 12. అంపమును 13. ఎదుర్కొని, 14. సమ్మెటకాఁడు, 15. యుద్ధశీలుఁడై, 16. నిప్పు మంట, 17 ప్రీతితో, 18 జ్ఞానము.

ప్రశ్నలు:—(1) ఇనుము గాని పై కుఠారాదుల కేల పగ?
(2) కుఠారుఁడేమి శపథము చేసెను? నెఱవేర్చుకొనెనా? లేదా? ఏల?
(3) కరపత్రుఁ డేమిప్రతిజ్ఞ చేసెను? ఎట్లయ్యెను?
(4) ముద్గరుఁడు ఏమిసవాలు పలికెను? అతనిగతి యే మయ్యెను?
(5) వహ్నికీల ఏమిపల్కెను?
(6) ఎట్లు అయోవీరుని లోఁగొనెను?
(7) కుఠారాదుల మార్గమునకును వహ్నికీల మార్గమునకును ఏమి భేదము? ఏది మంచిది? ఏల?
(8) ప్రాణిత్వసమారోపము లేకుండ ఇనుము, గొడ్డలి, అంపము, సమ్మెట, నిప్పుమంట, అని ప్రయోగించి కథాభాగమును సంగ్రహముగాఁ జెప్పుము.

## 36 వింధ్యాచల నిగ్రహము

ఉ. నెమ్మి నినుండు మేరుధర
  ణీధరనాథుఁ బ్రదక్షిణంబుగా
ద్రిమ్మరుచున్నఁ జూచి [1]పటు
  దీధితికిం గరమల్గి వింధ్యశై
ల మ్మనియెన్, "దినేంద్ర, యచ
  లప్రభువన్నుఁ బ్రదక్షిణంబు ని
త్యమ్మును జేయ కేల మతి
  దప్పితి? మేరువుఁ గొల్వ నేటికిన్?"

వ. అని గర్వించి పలికిన, నప్పర్వతంబునకు భానుండిట్లనియె.

క. "అనవరతము [2]విధియోగం
బున నేఁ ద్రిమ్మరుదు నమరభూధరముఁ బ్రియ
మ్మున; నాత్మేచ్ఛ యొనర్పఁగఁ
జన;" దనవుడు నలిగి వింధ్యశైలం బంతన్.

క. ఇనశశితారాదులకుం
జనరాకుండంగఁ బెరిఁగి [3]జలధరపథ మె
ల్లను గప్పి యుండె వింధ్యం
బ నుపమ ముత్తుంగమై సురాద్రిస్పర్ధన్.

క. రవిశశిగతు లుడుగుడు, 'నిది
దివ మిదిరాత్రి;' యని వసుమతీజనులకు

ద్దివిజ మునివరుల కెఱుఁగఁగ
5నవగాధం బయ్యె; నంధ మయ్యె జగంబుల్. ౫

వ. ఇట్లు పెరిఁగిన వింధ్యంబునొద్దకు వచ్చి వేల్పు లెల్ల దాని వర్ధనంబు వారింప నోపక యగస్త్యపాలికిం జని వింధ్యంబుపెక్కువ యెఱింగించి యిట్లనిరి,—

క. "భువనవ్యవహారమునకు
వ్యవధానం బయ్యె వింధ్యవర్ధనమున; న
ద్దివసకర రజనికర గతు
6లవిహాత మగునట్లు సేయు మమరమునీంద్రా". ౬

వ. అని దేవతలు ప్రార్థించిన నగస్త్యుండు లోపాముద్రా సహితుండై వింధ్యంబుసమీపంబునకు వచ్చి దానిచేఁ బూజితుండై యిట్లనియె,— ౭

క. "చనియెద దక్షిణదిశ కే;
నొనరఁగఁ దెరువిమ్ము నాకు నుర్వీధర, నీ;
వనవుడు, "నట్టుల చేయుదు,"
నని పెరుఁగుట యుడిగి వింధ్య మతివినయముతోన్,

7"భట్టారకా, విజయంచేయుం," డని భూమిసమా
మై యున్న దాని కగస్త్యుం డిట్లనియె:—

క. నా మగుడివచ్చునంతకు
భూమీధర, యీ ప్రకారమున నుండుము;

తో మైత్రిఁ జేయు; మని శిలో
సాముద్రాధీశ్వరుండు పలికి ముదమునన్. ౧౧

వ. దాని నొడంబఱిచి దక్షిణదశకుం జని లోకంబులకు హితం
బుగా నంద యుండె; వింధ్యంబు పెరుఁగ నోడియున్నది.

ఆరణ్యపర్వము III

1. సూర్యునకు 2. బ్రహ్మాజ్ఞను, నియతిప్రకారము, 3. మేఘ
మార్గము—ఆకాశము, 4. దేవతలకును మునిశ్రేష్ఠులకును, 5. మిక్కిలి
లోఁతైనది; అశక్యమనుట, 6. అవిచ్ఛిన్నమగునట్లు, 7. పూజ్యుఁడా
8. అగస్త్యుఁడు.

ప్రశ్నలు :— (1) వింధ్యము సూర్యునిపై ఏల అలిగెను ?
(2) సూర్యుఁడు ఏమి బదులుపలికెను ?
(3) వింధ్యము ఎట్లు పెరిఁగెను ? దాన నేమి యిడుములు కలిగెను ?
(4) దేవతలు అగస్త్యునేమి ప్రార్థించిరి ?
(5) అగస్త్యుఁడు వింధ్యము నెట్లు నిగ్రహించెను ?

## 37 స్వామిభక్తి

క. మును కాశీశ్వరు దేశం
బున నొకలుబ్ధకుఁడు వేఁటవోయినచోటన్
ఘనతర [1]విషదిగ్ధశరం
బున నేసిన, మృగముఁ దప్పి భూజముఁ దాఁకెన్. ౧

పువ్వులఁ గాయలఁ బెరిఁగిన
యావృక్షము శుష్క మయ్యె నవిషమున; ధా

శ్రీవర, తదీయ [2]కోటర
మావాసముగాఁగ నొకమహాశుక ముండెన్.

క. అది తరువు విడిచి పోవక
హృదయంబున భక్తిపేర్మి నెండను గాలిన్
జెదరక [3]ధృతిమై నయ్యెడఁ
గదలక యుండె [4]ననుజీవిగౌరవ మెసఁగన్.

ఉ. దాని యుదాత్తవృత్తము [5]శ
తక్రతుఁ డాత్మ నెఱింగివచ్చి, "ఎం
డైనది యిమ్మహీజము; మ
హాతరువుల్ ఫలవృద్ధి నొంది యి
క్కాన ననేకముల్ గలుగఁ
గా, నిటు లేఁటికి నిందు నిల్వనో
మానితకీరమా?" యనియె
[6]మానుషభంగికరూప మొప్పఁగన్

అనిన విని యాశుకంబు,

చ. [7]"అనయముఁ బండుచుండునెడ
నాశ్రయ మొప్పిన నిల్చి, యెండిన
యనతఱిఁ బాసి [8]పోక తగ
వెట్లు? కృతఘ్నత కాదె యివ్విధం
బనిమిషనాథ?" యన్న నతఁ
డచ్చెరువంది. "[9]పరాకృతోపసం

జనితవిశేష, మీాఖగము
జానుగ నన్ను నెఱింగె; దీనికిఁ

వ. మే లొనర్చెదంగాక;"

క. అని తలఁచి, "నీదుపలుకులు
విని మెచ్చితి; వరము గోరు విహగోత్తమ, నీ;"
వనిన శుక మహీజం
బునకుం 10బేరెలమి వేఁడెఁ బూర్వపుభంగిన్.

ఆ. అమరవల్లభుండు నమృతసేచనమున
భూజనముకుఁ దొంటిపొల్పుకంటె
మిగుల నెలమి సేసె; మేలియాశ్రితు లిట్ల
మనుతు రధిపు; మేలు మఱువ రెపుడు.

—ఆనుశాసనికపర్వము I

1. విషముపూయఁబడిన బాణము, 2. చెట్టుతోఁట, 3. ధైర్యముతో 4. ఆశ్రితునిగొప్పతనము, 5. ఇంద్రుఁడు, 6. నరాకృతి, 7. సదా, 8. పోవుట, 9. పూర్వపుణ్యముచేఁగలిగింపఁబడిన యతిశయముకలది 10 గొప్ప వికాసము—శుభము.

ప్రశ్నలు :— (1) వృక్ష మెందులకు ఎండిపోయెను ?
(2) శుకము 'సదాత్తవృత్తము' ఏమి ?
(3) ఇంద్రుఁ డాచెట్టు నేమి యడిగెను ?
(4) చెట్టు ఏమి బదులుపలికెను ?
(5) ఇంద్రుఁ డది విని ఏమనుకొనెను ?
(6) చెట్టు ఏమి వరము కోరెను ?
(7) నీతి ఏమి ?

## 38 విమతిసేవ

*క. మందరపురమునధీశుఁడు
మంద ప్రజ్ఞుండు దుష్టమతి తన ప్రజలన్
దుందుడుకు చేష్టలన్ గడుఁ
గ్రందగుకష్టములపాలుగా నొనరించున్.

సీ. ఎలుక వేఁటలపేర నేఁగి 1పట్టణము లోఁ
బ్రజలయిండులు కూలఁ ద్రవ్వఁ బంపుఁ;
జెలఁగి డేగలకుఁ దొండల నేయఁ బోయి ప్ర
జామంటపంబులు గాసిసేయుఁ;
గోడిపోరులపేర వాడలఁ దిరుగుచుఁ
బాడఁగన్న కడవలఁ బొలియవైచు;
వేఁటకుక్కలఁ దెచ్చి విడిచి మందలలోని
మేఁకల కుసిగొలిపి మెచ్చి యార్చుఁ;

తే. గాలకింకరులట్టికింకరులు తోడఁ
గూడి రాఁగూడి, ప్రొద్దును గూడఁ దొరఁగి,
వెడఁగుఁదనముఁ బ్రల్లదమును వేనవేలు
మదముతోఁ జేయు రాజకుమారుఁ డిట్లు.

క. ఆనరపతి యనువుగ నొక
2వానరపోతంబుఁ దెచ్చి వాత్సల్యముతో

దానిఁ బెనిచి, యాయుధవి
ద్యానిపుణతఁ బొందఁ జేసి, యది వర్ధిలుపన్

క. 3కంచుకము దొడిగి కుండల
చంచ 4త్కటకాదిభూషచయ మిడి 5శితఖ
డ్గాంచితరూపముతోఁ దన
6కంచుకిగా యుండఁ బనిచెఁ గదలక యెపుడున్. ౪

వ. ఇట్లుండ నతం డొకనాఁడు,

తే. సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి, "నన్ను,
డాయ వచ్చినజీవుల వేయు ఖడ్గ
ధారఁ దునియంగ," నని చెప్పి కూరె నిద్రఁ;
గపియుఁ బనిపూని భూపతిఁ గొలిచి యుండె. ౫

వ. ఆసమయంబున, ౬

మ. 7సుమనోదామము రాజుకంధరమునన్
శోభిల్ల నత్తావికై
భ్రమరం బొక్కటి మూఁగ, దానిఁ గని కో
పవ్యగ్రమై క్రోఁతి ఖ
డ్గమున న్వేసినఁ, దేఁటితోన ధరణీ
కాంతావతంసంబుకం
ఠము రెండ య్యె; 8వినీతిఁడైన 9పతిచే
ష్టల్ చేటు దేకుండునే?

—కేయూరబాహు 111

1 పట్టణమునశింపఁగా 2 క్రోఁతిపిల్ల 3 పెద్దలాగు [కంచుకి పెద్ద లాగుధరించును. "అన్తః కఞ్చుకికఞ్చుకస్య విశతి త్రాసా దయంవామనః" రత్నావళీనాటిక II] 4 హస్తాభరణములు మున్నగుసొమ్ములుపెట్టి 5 పదనైన 6 అంతఃపురపాలకుఁడు. 7 పూలదండ 8 నీతిరహితుఁడు 9 రాజు యొక్క.

ప్రశ్నలు :— (1) మందరపురాధీశుని దుడుకుచేష్టలు వర్ణించునది.

(2) క్రోఁతిపిల్ల నతఁడేమి చేసెను?

(3) క్రోఁతికేమి యాజ్ఞాపించెను?

(4) అదెట్లు ఆజ్ఞ నిర్వహించెను?

(5) నీతి ఏమి?

## 39 అహిమూషికోపాఖ్యానము

*క. క్రూరోరగదమునుండను
పేరిటి [1]యహితుండికుండు వింధ్యాటవిలో
ఘోర మగునొక్కసర్ప మ
భీరుండై పట్టి యొక్క పెట్టియఁ బెట్టెన్.

తే. పెట్టి, దానికి నెరగాఁగఁ బట్టి యొక్క
మూషకము వైచి, పెట్టియ మున్నవోలెఁ
గట్టి డించిన, నురగంబు గఱవఁరాఁగ
నెలుక బెదరక దానితో నిట్టులనియె,—

క. "నీ కుపకారము సేసెదఁ
నా కభయం బిచ్చి కావు: నాకారంబున్
నీకార్యంబును మేలై
చేకుఱు, నాతోడఁ జెలిమి చేసితి వేనిన్.

ఆ. వాఁడు పట్టినపుడ వానిచే నైనను
జావ వలయు: నాకుఁ జావు నిజము;
చచ్చియున్ననన్నుఁ జంపి, చావనినీకుఁ
జెలిన యుండఁదలఁచు చెలికి యగునె? ४

క. 'ఏ నధికబలుఁడ; నాచే
గానిది యీ యెలుక చేతఁ గానోపెడునే?
తా నీచెలి యేవిధమున
మానుచు? నిదికల్ల;' యనుచుమదిఁ దలఁపకుమీ. ౫

క. నాచెప్పినట్లు చేసిన
నీచెలి విడు: నట్లుగాక నిలుపోపక నీ
వే చంపి నన్ను నోరను
వైచికొనిన మానునే భవత్ సత్యుత్రెల్లణ?" ౬

క. అనవుడు నురగము సంతస
మున శినాఖువుతోడ, "స్వప్నమున నైనను గీ
డొనరింప; నీవు నాచెలి;
వనుమానము దక్కి నమ్ము మానందముతోఁన. ౭

వ. ఇక్కరండనిగ్రహ మెట్టుడిపెద వుడుపు;''మనుటయు,ఁ

క. "ఏ నొకమంత్రము నీతల
పై నుండి జపించి, జపము వారించి తగం
గా నినుఁ బిలిచెదఁ, గదలక
నీ నయనయుగంబు మూసి నిలు మందాఁకన. ౮

చ. అని నియమించి దానిశిర

5మంజక యెక్కి, కరండనిగ్రహం

బనువుగఁ ద్రోసి, యాఖు వది

యప్పుడ పోయె; ననంతరంబు లో

చనములు విచ్చిచూచి మది

సంతసముం బగపుండలిర్ప నా

6కనుమన తాను నేఁగి భుజ

గం బొకబొక్క వసించి, యాత్మలోఁ, ౧౦

క. "ఎలుక కపటమున నాక

న్నులు ప్రామెను; మ్రింగ లేద; 7నోరెరియఁ గటా!

తొలఁగెద; నిఁ కేటి బ్రదుకు?" కని

తలఁచె; దురాత్ములకు నెందుఁ 8దగవులు గలవే? ౧౧

— కేయూరబాహు IV

1 పాములవాఁడు 2 ఆఁకలి 3 ఎలుక 4 పెట్టెచెఱ 5 భయపడక 6 సందున నే 7 నోరుమండఁగా 8 ధర్మములు.

ప్రశ్నలు:— (1) పాములవాఁడు పాము నెట్లు పదిలముచేసెను? దాని కాహార మెట్లు ఇచ్చెను?

(2) ఎలుక ఏల బెదరలేదు? పాముతో నేమిచెప్పెను?

(3) పాము ఏమి బదులుపలికెను?

(4) పెట్టె చెఱఁబాపుటకు ఎలుక ఏమి యుపాయము చెప్పెను?

(5) ఎలుక పామునోటఁజావాసి అప్పుడే ఏలపోయెను?
(6) పామునకు ఏల వగపు? ఏల సంతసము?
(7) ఎలుక బొరియయొద్ద పాము ఏమని యంగలార్చెను?

## 40 శ్రీ కృష్ణుని దుడుకుచేతలు

వ. గోపికలు యశోదకడకు వచ్చి యిట్లనిరి,-

క. బాలురకుఁ బాలు లేవని
బాలెంతలు మొఱలు వెట్టఁ బకపక నగి, యీ
బాలుండాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ. ౨

క. పడఁతీ నీబిడ్డఁడు మా
కడవలలో నున్నమంచికాఁగినపాలా
పడుచులకుఁ బోసి, చిక్కిన
కడవలఁ బో నడిచె; నాజ్ఞ గలదో లేదో? 3

క. మీపాపఁడు మాగృహముల
[2]నాపోవఁగఁ బాలు ద్రావ నగపడకున్నఁ,
గోపించి పిన్నపడుచుల
వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ. ౪

మత్తకోకిల

పుట్టిపుట్టఁడు, నేఁడుదొంగిలఁబోయి మాయిలుసొచ్చి తా
నట్టియందక ఱోలుఁబీఁటలు నొక్కటొప్రోవిడియెక్కి చే

వెట్టఁ జాలక కుండక్రిందొక పెద్దతూఁటొనరించి, మీ
పట్టి మీఁగడ పాలుఁ జేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ.

క. ఆడం జని వీరలపెరుఁ
గోడక నీసుతుఁడు, ద్రావి యొకయించుక తాఁ
గోడలి మూతిం జరిమిసఁ,
గోడలు శిక్షించు నత్త గొట్టె లతాంగీ.

క. వారిల్లు సొచ్చి కడవలఁ
దోరం బగునెయ్యి ద్రావి, తుది నాకడవల్
వీరింట నీసుతుం డిడఁ,
వారికి వీరికిని దొడ్డవా దయ్యె సతీ.

క. "వేలుపులకె? నాకంటెను
వేలుపు మఱి యెవ్వఁ?" డనుచు వికవిక నగి మా
వేలుపులగోడపై నో
హేలావతి, నీతనూజుఁ డెంగిలి చేసెన్.

ఆ. నమ్మి నిదుర వోవ నాపట్టి కుంచు మా
లేఁగతోఁకతోడ లీలఁ గట్టి,
వీథులందుఁ దోలె; వెలఁది, నీకొమరుండు,
రాచబిడ్డఁ డైన నవ్వ మేలె?

క. నాపట్టి పొట్ట నిండఁగఁ
బైపడి నీపట్టి వెన్న బానం డడ, నాఁ

దూపిరి వెడలదు; వానిం
జూపెద; నే మైన నీవ చుమ్మి లతాంగీ. ౧౦

సీ. కలకంఠి, మావాడ గరితల మెల్ల నీ
పట్టి రాఁగలఁడని పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దనత్రోవఁ
జూచుచో, నెప్పుడు సొచ్చినాఁడొ!
తలుపులముద్రలుఁ దాళంబులును బెట్టి
యున్న చందంబున నున్న వరయ;
నొకయింటిలో నాడు, నొకయింటిలోఁ బాడు,
నొకయింటిలో నవ్వు, నొకటఁ దిట్టు,

ఆ. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షిఘోషణములు పరఁగఁజేయు;
నిల్లు సేసి వెనుక నెక్కడఁ బోవునో
కానరాఁడు, రిత్తకడవ లుండు.

క. కడు లచ్చి గలిగె నేనిం.
గుడుతురు, గట్టుదురుగాక, కొడుకు
ఁబడుగులవాడలపైఁ బడ
విడుతురె రాకాంత లెందు, విమలేందుముఖీ? ౧

క. ఓయమ్మ, నీకుమారుఁడు
మాయిండ్లను బాలుఁ బెరుఁగు మననీఁ డమ్మా;

పోయెద నెక్కడి కైనను;
[6]మాయన్నల, [7]సురభులాన మంజులవాణీ ౧౩

—భాగవతము-దశమస్కంధము.

1. జగడము, 2. తనియఁగా, 3, దొంగ, 4. పిల్లజుట్టు, 5. ఆశక్తుల, 6. అన్న+అల=ఓ తల్లీ 7. ఆవులు, అన్నల ఆవులపై నొట్టు పెట్టుకొనిరి.

ప్రశ్నలు:— (1) శ్రీకృష్ణుడు పాలు పెరుఁగు నేయి దొంగిలింప నేమి చేసెను ?

(2) వేలుపుగోడపై కృష్ణుఁ డేమి చేసెను ? ఏల ?

(3) నిదురపోవు గొల్లబాలుని నేమి చేసెను ?

(4) గోపికలు పాలు పెరుఁగు ఇండ్లలో కాపాడఁగా, కృష్ణుఁ డేమిచేసెను ?

(5) గోపికలు ఏ మని యశోదను నిందించిరి ?

## 41 పవనశాల్మలీతరుసంవాదము

తే. "బూరువా, యింతపఱపును బొడవుఁ గల్గి
నీవు మృగపక్షిసంశ్రయణీయ మగుచు
నునికిఁ గని ప్రీతి నడిగెద; ననిలుచేతఁ
బడు నొకప్పుడు తరులు, నీపడమి యెట్లు?

క. "పవనునకును నీకును బాం
ధవము గలదో ? యతఁడు నిన్ను దయ రక్షింపన్
సవినయవృత్తిని బ్రదికితొ ?
చెవులకు నిం పెసఁగ నిజము సెప్పుము నాకున్."

వ. అని హిమవంతంబునందుఁ బెద్దకాలంబునుండి వరలు నొక్క శాల్మలీమహీజంబును జూచి నారదమునీంద్రుఁ డడిగెను.

క. అని యడుగ, బూరు వి ట్లను,—
"అనిలునిబల మస్మదీయ మైనబలముతో
[1]నెన గా; దేర్పడ విను, పదు
నెనిమిది యగువంశమునకు నెనయ దరయఁగన్." ౪

వ. అని పలుకుటయు నమ్మునీంద్రుండు, ౫

ఆ. "అమ్మచెల్ల! యిట్టు లనకుము; కొండలు
లోనుగాఁగఁ బవనుచే [2]నపాస్త
మహిమము లగు టెఱుఁగుమా; భూతములచేష్టి
తములు వాయువశగతములు గావె?" ౬

క. అనుటయుఁ [3]బెలుచని మెలుఁగున,
"ఘనమూలప్రబలశాఖికాదుర్జయు న
న్నును దాఁకిన నతని[4]ప్రభం
జనుఁ డనునామంబునకు నసత్యత వచ్చున్." ౭

వ. అని గర్వంపుమాట లాడినయాశాల్మలిం జూచి సుర మునిప్రవరుండు,— ౮

చ. "మఱవక యుండు నీవిరుదు
మాటలు; నీవిటు లంట మాఱుటుం

డెజీఁగెడు నెట్లు;" నంచు వెస
నేఁగి సమస్తముఁ జెప్ప నాతఁ5డే
త్తెఱఁ జనుదెంచి, "నీవటె 6క
డిందిమగండవు ? నిన్నుఁదాఁకినం
జెఱుతటె పేరు! బూరుగ, న
శించితిగా కిట పల్కు లేటికిన్ ?" ౯

మ. అని కోపంబునఁ బల్క నప్పవనుతో
నాభూరుహం బింతపె
ల్చన, "నీ వాఁడెదునంత తక్కువని? బే
లా, లోకసామాన్యవౌ
తునికాయంబును నన్ను నొక్కటిగ ని
చ్చం జూచితే?" యన్న న
ల్లన నవ్వొప్పఁగ నాసమీరణుఁడు 7హే
లాస్ఫారుఁడై యిట్లనున్. ౧౦

క. "ఒకనాఁ 8డజుఁడు నీనీ
డకు9డబ్బా టరుగు దెంచుటయు, నమ్మేలా
త్మకు ఁ ౖవేఁగె మన్నించిన,
10మెకమెకపడి; తిట్లు పలుకుమీ తగ రేపున్." ౧౧

వ. అని పలికి బలు మొగంబుతోడం బోయిన, నబ్బూరుపు
దలంకి,

చ. "మనుగడ దప్పకెక్కొ? ముని
మాటలు గైకొన నైతి; నాబలం
బన నది యెంత? యుగ్రత మ
హాబలురాకకు నోర్వఁజాల; నా
తని నొకభంగి గెల్తు;" నని
తాఁ దలపోసి హరించె నాకులుం
గొనలును జొంపముల్ నిదుద
కొమ్మలు రే యగుడుఁ రయంబునన్. ౧౩

వ. అట్లు తన్నుం దాన విఱుచుకొని యున్నంత, ౧౪

చ. ప్రతినకు నీడు గా భయద
భంగిఁ బ్రభంజనుఁ డేఁగుదెంచి యా
క్షితిరుహముం గనుంగొని, "యి
సీ! యిది నాపని నీవ చేసి; తీ
[12]ధృతి కిఁక సంతసింపు; మిటు
తేజముఁ బొందుము; నీదు బాంధవ
ప్రతతికి నివ్విధంబునదు
పాయము మే లెఱిఁగింపు పెంపునన్." ౧౫

వ. అని [13]యుల్లసం బాడి యా[13]సదాగతి ననియె; నట్లు
శాల్మలి పవనుచేత భంగంబు నొంది వగం గుందెను ౧౬

1. సమానము, 2. పోఁగొట్టఁబడిన, 3. పెద్దదైనకంఠముతో 4. వాయువు, (వ్యు. వృక్షశాఖాదులను నిఱుగఁగొట్టువాఁడు) 5. పరాక్రమముతో, 6. మేటివీరుఁడవు, 7. విలాసాతిశయముతో, 8. బ్రహ్మ 9. అకస్మాత్తుగా, 10. ఉద్ధతి నొందితివి, 11. భయపడి, 12. ధైర్యమునకు, 13. పరిహసించి, 14. వాయువు.

ప్రశ్నలు:—(1) నారదుఁడు బూరుగుచెట్టు నేమి యడిగెను?
(2) అది ఏమి బదులు చెప్పెను?
(3) నారదుఁ డేమని మందలించెను?
(4) బూరుగుచెట్టు ఏమి గర్వోక్తు లాడెను?
(5) ఇవి వాయుదేవున కెట్లు తెలియవచ్చెను?
(6) అతఁడు బూరుగుచెట్టుతో నేమనెను?
(7) బూరుగుచెట్టు వాయుదేవుని 'జేలా' (: అజ్ఞానుఁడా) అని ఏల పలికెను?
(8) వాయువు బూరుగుచెట్టునెడ ఏల నెనరుతో వర్తించుచుండెను?
(9) బూరుగు ఎట్లు పశ్చాత్తాపపడెను?
(10) వాయువు ఏమని యుల్లసమాడెను?

## 42 కపిలాఖ్యానము

సీ. దేవత లాఁకొని 1దేవతాజ్యేష్ఠునిఁ
గావంగఁ బోవ; నాకమలజన్ముఁ
డమృతమిచ్చిన, వమద మారఁగా ద్రావఁ ద
2త్సురభిత్వసంపద 2సురభి వుట్టె;
...చె 5సౌరభేయుల నవని నుత్పాదించె;
నొకయప్డు హిమగిరియుపరితల మ

లంకరించుచు నవి శంక యించుక లేక
యున్నెడ, వానిలో నొకటి లేఁగ

తే. చన్ను గుడువఁ, దద్దాస్యనిష్యందమాన
మైన [6]దుగ్ధఫేనము [7]పవమాననిహతిఁ
దూలి దప ముగ్రముగఁ జేయుశూలివక్త్రాళిఁ
బడినఁ, నద్దేవుఁ డధికకోపంబు గదుర. ౧

క. [8]చిచ్చఱకన్నదరఁగ వే
విచ్చినఁ [9]గపిలత్వ మొందె [10]విబుధప్రకరం
బచ్చెరు వందుచుఁ గన్గొన
నచ్చెరువసౌరభేయు లమలచరిత్రా. ౨

క. అవి బిట్టు బెదరఁ, దక్కటి
యవియు నదరె బెదరె; నిట్టు లగ్గోవులు వా
తెఱ వెసను సోమునిపాలికి;
నది యంతయుఁ దా నెఱింగి [11]యజుఁడే తెంచెన్. 3

సీ. ఏతెంచి [12]నిభృతిమై నీశ్వరచరణాంబు
జములకు నెఱఁగి, హస్తములు మోగిచి
"యమృత [13]సిక్తుఁడ వైతి; వఖలేశ, గోవుల
కెంగిలి లే; దిందుఁ డెట్టు లమృత
మొసఁగు, నట్టుల గోవు లొసఁగు దుగ్ధంబులఁ;
దద్వత్స [14]పీతదుగ్ధంబు శుచియ;

కాఁ గోపము దక్కఁ గరుణింపు;” మని యొక్క
కమనీయవృషభంబుఁ గప్పమిచ్చె

తే. శివుఁడు ప్రియమంది దానిఁ 15 గేతువును వాహ
నంబుగాఁ జేసి, సకలజనంబు నెలమి
వృషభకేతనుఁ డనియును వృషభవాహ
నుండనియుఁ బేర్కొనఁగ నొప్పి యుండు జగతి. ౫

వ. ఇట్లు ప్రసన్నుండయితనచూపునం గపిల లయినగోవుల
కుం దక్కనవర్ణంబుల గోవులకంటె నుత్తమత్వంబు
గలుగ వరంబిచ్చి విరించిని వీడ్కొలిపె. ౬

—అనుశాసనికపర్వము III

1 దేవతలలో పెద్దయైనబ్రహ్మను 2 పరిమళాతిశయముచేత 3 కామధేనువు 4 ఆవులను 5 దానినోటినుండి స్రవించుచున్న 6 పాల నురుఁగు 7 గాలి దెబ్బచేత 8 అగ్గికన్ను (మూఁడవకన్ను) 9 గోరోజన మువంటిరంగుకలుగుటను 10 దేవసమూహము 11 బ్రహ్మ 12 వినయముతో 13 తడుపఁబడినవాఁడవు 14 త్రావఁబడినపాలు 15 టెక్కెమును

ప్రశ్నలు:— (1) ఆవులెట్లు పుట్టినవి?
(2) శివునకు ఆవులపై ఏల కోపముకలిగెను? తత్ఫలమేమి?
(3) బ్రహ్మదేవుఁడేల శివునికడ కేఁగెను?
(4) ఏమి విన్నవించెను?
(5) శివునకు వృషభకేతనుఁడని, వృషభవాహనుఁడని ఏల పేరువచ్చెను?
(6) శివుఁడు కపిలగోవుల నెట్లనుగ్రహించెను?

# 43 శశవిజయము

*క. తొల్లి పదిరెండు ¹శరదము
లెల్లెడ వఱ పొందె; సరము లింకెను; బ్రాణుల్
దల్లడ మందెను; మనుగడ
కల్లగఁ గన్పట్టె నొక్క కాంతారమునన్. ౧

*క. కరియూథ మొండు తమదౌ
సర మెండఁగ, ²నీరువట్టు సైపఁగ భరమై
సరభసరీతిని నెల్లెడ
నరయుచుఁ దుది నొక్క మడుఁగు నతిహర్షమునన్. ౨

వ. కని యందుఁ జొచ్చిన, 3

తే. అట్టిసంరంభగమనంబునందు, నందుఁ
గల శశంబులు తత్పాదఘట్టనమున
మ్రంది మృతిఁ బొందుటయుఁ, జింత నొంది శశక
నాయకుండు శిలీముఖనాముఁ డపుడు, ౪

వ. గజంబు లచ్చోటు వాసి చనునుపాయం బూహించి, ౫

ఆ. కదలిపోయి చంద్ర⁵కాసారమున కెంతొ
చెంత నున్న శైలశిఖర మెక్కి
నిక్కి, "యోగజేంద్ర, నీకు సేమమె?" యన్న
దొండమెత్తి చూచి కొండమీఁదు,

వ. "నీ వెవ్వండవు? ఎచటనుండి నీ వేమికార్యంబున కిట
వచ్చితివి?" యని యూథపతి యడిగిన నా శశపతి
యిట్లనియె. ౭

తే. "[6]ఓషధులఁ బ్రోచి, జీవుల నుద్ధరించు
[7]కైరవాప్తునిదూత; నిక్కడకు నన్ను
నతఁడు పుత్తెర వచ్చితి; [8]ననవితథముగఁ
బ్రభుని [9]కార్యార్థ మే నిదె పల్కువాఁడ. ౮

క. ఈకొలను చంద్రుపేరన్
బ్రాకటముగ మున్ను కలిగె; బహుపక్షికుల
[10]వ్యాకీర్ణతలమహీజ
శ్రీకన్గొని పొగడుచుంద్రు సిద్ధులు దీనిన్.

క. ఇందులకుం గావలిగాఁ
బొందుగ మ మ్మునిచినాఁడు [11]బుధజనకుఁడు మ;
మ్మిందఱను మట్టిచంపితి;
రిందునితో వైరపడఁగ నెంతటివారల్?

క. శశికిన్ వంశ్యుల మగుటను
శశకము లనఁ బరఁగి ధాత్రిఁ జరియింతుము; క
ర్కశహృదయులార, మీకిఁక
వశ మగునే నిలువ?"—నని [12]వారణ మనియెన్. ౧౧

"ఈ తెఱ గెఱుఁగక వచ్చితి;
మీ తెరువున నడవ మింక; నేఁగెద మిదె; మీ

రీత పో్ర్వ్యఁగఁ దగు;" నని
[13]మాతంగవుఁ డచటు వాసె మదగజములలోఁ. ౧౨
—పంచతంత్రము, సంధి.

3 సంవత్సరములు 2 అనావృష్టి 3 దప్పి 4 కుంజేశ్వ 5 సరస్సు 6 మందుచెట్టులు 7 చంద్రుఁడు 8 నిజముగా 9 కార్యకీతిని 10 మిక్కిలి నిండియున్న క్షీరవృక్షములలోఁ 11 చంద్రుఁడు 12 ఏనుఁగు 13 గజరాజు

ప్రశ్నలు:—(1) ఏనుఁగుల గుంపులు చంద్రకాసారమున కేల వచ్చినవి?
(2) వానివలన ఎవరి కేమి యాపద గలిగెను?
(3) శిలీముఖుఁడు ఏనుఁగురాజుతో ఏమి చెప్పెను?
(4) శశములకు చంద్రునకు ఏమి సంబంధము?

## 44 హంసమొఱ

క. కాంచనపక్షం బగురా
యంచం గనుఁగొని నృపాలుఁ డనురాగముతో
"వంచించి పట్టుకొనియెద,"
నంచుఁ దలఁచె దైవఘటన కనుకూలముగాఁ.

వ. ఇట్లు పట్టుకొని దానిబంగరు ఱెక్కల రూపసంపద కద్భుతంబంది చూచునలమహారాజున కారాయంచ మనుజభాషల నిట్లనియె,

క. "ఱెక్కలకోనలం గలిగిన
యిక్కాంచన మాసపడియెదే నృప! నీకే

యక్కడఁ బదీనం దీరెదు
నక్కట! [1]సీహారకణికఁ నర్థికిఁ బోలెన్ ? 3

చ. ఎఱుఁగనె నీవు ప్రాంతమున
నింతటనంతట నున్కి; యింతయే
మఱుదునె? నిన్ను విశ్వజన
మాన్యుఁడ వంచును విశ్వసించి యి
త్తఱి సుఖనిద్రఁ బొందితి వృ
థామతి; [2]నెట్టన యాత్మ నమ్మినం
జెఱుపఁ దలంతురే ఘనులు
చిత్తమునన్ బగవారి నేనియున్ ? ౪

ఉ. హింసయ నీకు వేడ్కయగు
నేని, గృహాశ్రయ మైనయీసరో
హంసముఁ జంప నేల? కఱ
వా తెరువాత వసుంధరాధిపో
త్తంస, విజృంభమాణభుజ
దర్పనిరంకుశ సాహసక్రియా
మాంసల చిత్తవృత్తు లయి
మం త్రిలి యుండు నరాతిభూపతుల్ ? ౫

వ. ఫలకుసుమమూల మాత్రంబున శరీర యాత్ర నడపుచు,
మునులుం బోలె, సలిలంబులలోనఁ దపంబు సేయుచున్నా

రము మాకుమాఁద దండనీతి ప్రయోగింప నీకుం దగునె? యదియునుంగాక, ౬

సీ. తల్లి మా కేకపుత్త్రిక, పెద్ద, కన్నులు
గాన విప్పుడు; 5ముసలి కాళ్ళు ముసలి;
యిల్లాలు గడు సాధ్వి, యేమియు, నెఱుఁగదు,
పరమపాతివ్రత్య భవ్యచరిత;
వెనుక ముందఱ లేరు వెన నైనచుట్టాలు;
6లేవడి యెంతేని జీవనంబు;
గానక కన్నసంతానంబు శిశువులు;
జీవనస్థితి కేన 7తావలంబు;

తే. కృపఁ దలంపఁగదయ్య యో నృపవరేణ్య;
యభ8యమీవయ్య యోశీతుహినాంశువంశ;
కావఁగదవయ్య యర్థార్థికల్పశాఖి,
నిగ్రహింపకువయ్య, యోనిషధరాజ, ” ౭

వ. అని విలాపంబు సేయుచు దృగ్గోళకంబుల వేఁడికన్నీరు వెడల గోలుగోలున నేడ్చినం, గృపాళుండై యాభూపాలుండు హస్తపల్లవంబులు వదలి, “రాజహంసంబ, పొమ్ము, సుఖంబుండు;” మని విడిచిపుచ్చెను.

—శృంగార నైషధము. ౮

1 చిన్న మంచుబొట్టుచేత సముద్రమునకుంబోలె 2 మిక్కిలి 3 ఆవల 4 పొగరుగొనిన మనోవృత్తులుగలవారయి 5 మూఁడవకాలు

చేతికఱ్ఱ 6 పేదతికము 7 ఆధారము 8 చంద్రవంశమువాఁడా 9 దండింపకుము.

ప్రశ్నలు :— (1) ఏల 'దైవఘటన కనుకూలముగా' ననుట?
(2) తన్ను విడిచిపుచ్చుమనుటకు హంస నలమహారాజుతోఁ జెప్పిన యుపపత్తు లేవి?
(3) హంస మృతినొందిన దానికుటుంబస్థితి ఎట్లుండును?
(4) నలుఁడు హంసను ఏల విడిచిపెట్టెను?

## 45 శుకియుక్తి

చ. ఒకపెనుకానలో నొక మ
హోన్నతభూజమునందు బాలశా
బకముల [1]నస్ఫుటాప్రబల
పక్షములం గలవానిఁ బ్రోచికొం
చొకశుకి యుండు; న త్తరువు
నొద్దన చిక్కనివెల్గుమానియుం
దొక[2]ఫణినాయకుండు గర
లోల్బణుఁ డుండును [3]గోటరంబునన్. ౧

వ. ఇట్లుండ నొకనాఁడు బోయ యొకండు తనపిల్లలఁ జంపఁ జెట్టెక్కిన, చిలుకవెలఁది జాలిమెయి నతనితో నిట్లనియె,

క. "అన్నన్న! లేవె పక్షులు?
కన్నులు తెఱవనివి తిన్నఁ గలదే చవి? వే
[4]మన్నిగొన నేల? విడువఁగ
దన్న; యకట! చంపఁ గూడునయ్యఁ శిశువులన్?" 3

చ. అనవుడు బోయ యిట్లను శు
కాంగనతో, "నడలంగ నేల? నీ
తనయులఁ జంప నేను; [5]బిసి
తంబులు [6]బ్రాఁతియె నాకు? వీనిఁ గై
కొని వెల వెట్టువారికడ
కుం జని యమ్ముదు; [7]విల్చి వారుసర్
బెనుతురుగాని, వీని కొక
పీడ యొనర్పరు; నమ్ము నెమ్మదిన్. ౮

క. అనవుడు దానికిఁ గీరాం
గన, "సంపఁగ నొల్ల వేని, గనకముపైఁ గాం
తున పట్టి తేని, విడు నా
తనయుల; నీ కేను జూపెదను హేమంబు! ౯

మ. ప్రకట శ్రీయుతుఁ డొక్కఁ డీయడవిలోఁ
[8]బాటచ్చర శ్రేణిబా
ధకు నుల్లంబున నోడి మొన్న తనయ
ర్థం బొక్కచో డాఁచెఁ; ద
ప్పక యేఁ జూచితి; నున్న దాపసిఁడి; చూ
పం జాలుదున్; నన్నుఁ బు
త్రకులన్ గాచెద నెల్లనాఁడు నని వం
తం బాపి రక్షింపుమా." ౧౦

మ. అనినన్ జెన్నిధి యప్పుడే కనినయ
ట్లానందముం బొందె, "యే
నిను నమ్మించుదు;" నంచు 9శాబకముల
10న్నీడంబులోఁ బెట్టి, చ
య్యన భూమీజము డిగ్గి బోయ నియతుం
డై యొక్కచో నిల్చి, యు
ర్లను బోనున్ వెస ముట్టి, నమ్మఁ దగుప
ల్కుల్ వల్కె నిర్వంచనన్.

వ. అప్పుడు కీరవనిత వానితో నిట్లనియె,

క. "నమ్మిక లవి యేమిటికిం?
గ్రమ్మఱ వచ్చెదవె నీవు? ఖగమృగబహుదుః
ఖమ్ములకును నాచూపెడు
సొమ్ములపైఁ జేయి వెట్టి సుఖివై నతుదిన్."

వ. అని పలికి యిదె రమ్మని తోడ్కొని చని,

గీ. 11పూనుఁగాఁడియంతభుజగంబు లో నున్న
వెలఁగ ప్రమాని వెడఁద 12తొఱట సూపి
"దీనఁ జేయి వెట్టు; లోననున్నది సవి
శేషహేమ;" మనుచుఁ జిలుక చెప్పె.

ఉ. చెప్పిన వెఱ్ఱిబోయ 13వల
చే యటు సొన్పుడు, నందుఁ గన్నులన్

నిప్పులు రాలుచున్న మహా
నీయగరోజ్జ్వల భీషణోరగం
14బుప్పలవాయిఁ దిన్న, విష
ముగ్రత నెక్కుడు, దృష్టిజీఁకటుల్
గప్పఁగ, నోరఁ బెన్నురువు
గ్రమ్మ, మృతుండయి కూలె మేదినిన్. ౧

—కేయూరబాహు V

1 తెన్నగా పోటమరింపని బలములేని ఱెక్కలుగలవానిని 2 పములజేఁడు 3 చెట్టుతొఱ్ఱలో 4 చంపనేల 5 మాంసములు 6 అరుదా 7 కాని 8 దొంగగుంపుయొక్క 9 పిల్లల 10 గూటిలో 11 ఎద్దుఁ అఱ్ఱు పైఁదాలుచు నట్టి కాఁడిప్రమాణముద్దైన 12 తొఁటఱకలుఁగ 13 కుడిచేయి 14 బొట్టన జుట్టన ద్రేళ్ళనడుము.

ప్రశ్నలు:— (1) ఆఁడుచిలుక బోయవానిని ఎట్లు మందలించెను?
(2) వాఁడేమి చెప్పెను?
(3) శుకి బోయవానిని జంపుటకు ఏమియుక్తి చేసెను?
(4) "నమ్మిక లివియేటికి" అను పద్యములో ఆఁడుచిలు యుద్దేశించిన యంతరార్థ మేమిస్ఫురించుచున్నది

## 46 గరుడుని పరాజయము

క. అంబుధితీరంబునఁ గూ
ర్మంబులు చరియించుచుండుఁ; బ్రతిదినమును వా
నిం బట్టి తనకు నాహా
రంబుగఁ గొనుచుండుఁ బక్షిరా జుగ్రుండై.

వ. ఇట్లుండ నొక్కనాఁడు,—

చ. వననిధినీట నిల్చి ఖగ
వల్లభుతో నొకకూర్మముఖ్యుఁ డి
ట్లనియె, "మదీయబంధు నివ
హంబులు దేవరవాతఁ ద్రుంగె; నే
న నిలిచినాఁడ; నిప్పటికి
నాకుఁ దొలంగినఁబోదు; నీకు నా
కు నొకటి పన్నిదంబు సమ
కూఱునె? యాలము మాని చెప్పుమా."

క. అనుటయు నవ్వుచు [1]వినతా
తనయుం, "డది యేమి పన్నిదము? సెప్పవయా"
యనవుడు, "నలుగక చిత్తం
బున నించుక యవధరింపుము, మహావిహగా.

మ. [2]ఉడువీథిన్ వెస నీవు వాఱి, జవస
త్త్వోత్సాహ, యంభోధితో
గడవం బాఱెద; నిన్ను నేను మిగులం
గాఁ, జాలిన న్లైన, నె
న్నఁడు భక్షింపకు మమ్ము; నోడినటులై
నన్, మాకులం బెల్ల నె
ప్పుడు నాహారముగొమ్ము నీవు వినతా
పుత్త్రా, మహాధార్మికా"

వ. ఇవ్విధంబు సేయం దలంపు గలిగెనే నొక్కనాఁ డిచ
టికిం విజయంచేయుం;" డనియె; ఖగరాజొండంబడి
పోయె; న దెల్ల తన చుట్టంబులతోఁ జెప్పి కూర్మవల్ల
భుఁడు వారలతో నిట్లనియె,—

క. "ఆమఱి యెడఁ బది పది గా
సాముద్రతటంబునీరఁ జని యుండి ఖగ
స్వామి పఱవంగ, నాతని
కాముందటివాఁడు చూపునది కోపాడవచటన్."

కం. అని యనుకొని పతగాధిపు
ననిపినయెడఁ గూర్మవిభుఁడు నట్టులె యుఱఁ
క్కన వది మొదలుగ బహుయో
జనములవఱ కంతనంతఁ జక్కఁగ నిలిచెన్.

వ. మఱునాఁడు 4సమయప్రకారంబు సనుదెంచి,

క. గరుడుం డవ్వేలనికి స
త్వరగతిఁ గూర్మంబుఁ బిలిచి, వారిధిపై నం
బరవీథిఁ బెద్దయును ద
వ్వరుగుచు, నది చిక్క నోవు నని 5చీరుటయున్

క. "ఓ యని పలుకుచు ముందఱఁ
దోయధిలోఁ గచ్ఛపంబు దోఁచిన, మఱియున్
వాయుగతిఁ బఱచి చీరిన,
నామెడ నగ్రమునఁ గమఠ మల్లన నెగసెన్.

వ. అవ్విధంబుఁ గని యచ్చెరు వొందుచు,

క. అందుండి మగుడఁ బఱచుచు
ముందఱ నెట్లట్ల పిలువ, ముందఱ నంతం
తం దోఁచుచు, నవి పిలుఁ దులు
ముందఱగాఁ జేసి పక్షిముఖ్యుని గెలిచెన్. ౧౩

క. అతఁ డటు జితుఁ డౌటను ల
జ్జితుఁడై మీకెందు నెగ్గు సేయం; బ్రమద
స్థితి నిలువుఁ" డనుచుఁ బోయిన
నతిసంతోషమునఁ గచ్ఛపావళి యుండెన్. ౧౪

—కేయూరబాహు III.

1. గరుత్మంతుడు, 2. ఆకాశము, 3. పొడవునూపుది = కనఁబడునది, 4. ఒడంబడిక చొప్పున, 5. పిలువఁగా, 6. సంతోషముతో.

ప్రశ్నలు :— (1) తాబేటి ఱేఁడు గరుఁడునితో నేమి పందెము వేసికొనెను?
(2) అతఁడు చుట్టములతో నేమిచెప్పెను?
(3) గరుడుఁడు ఎట్లు పందెమునవోడెను?
(4) గరుడుఁడు కూర్మముల కేమి మాట యిచ్చెను?

## 47 సిరియాళుని యాత్మస్థైర్యము

(ఒజ్జయింట విద్య నభ్యసించుచున్న సిరియాళుని యొద్దకు తన్మతి చలింపఁజేయు కుతూహలంబున జటాధారియై జంగమ రూపంబున పరమశివుం డేఁగుదెంచెను. అప్పుడు,)

తే. ఆ[1]జటాధారి చేరంగ నరుగుదెంచి,
తనకు సాష్టాంగ మెఱఁగి తాత్పర్య మెసఁగఁ
గేలుఁదమ్ములు మొగిడించి [2]కెలన నున్న
చిన్నిముద్దులసిరియాళసెట్టి కనియె. ౧

శా. "అన్నా, యీచిరుతొండనంబి యనుపా
పాత్ముండు మీతండ్రియే?
యన్నిర్భాగ్యుఁడు జోగి కొక్కరునికిన్
[3]హాలామదోన్మాదికిన్
నిన్నుం జంపి [4]మహోపహారముగ వం
డింపంగ నున్నాఁడు; సం
పన్న స్నేహముతోడ నీకు నెఱిఁగిం
పన్ వచ్చితిం జెచ్చెరన్.

క. కడుపునఁ బుట్టినకూరిమి
కొడుకున్, సుకుమారమూర్తిఁ, గులవర్ధనునిన్,
మెడ గోసి చంపి [5]నంజుడుఁ
గుడుపుల జోగులకుఁ బెట్టుక్రూరులు గలరే? 3

తే. దానవుఁడు గాక వాఁ డేటితండ్రి? చెప్పుమ;
చెక్కు గీఁటిన పస వల్చు చిఱుతవాని
మత్తుఁ డొక్కఁడు మధుపానమత్తుఁ డగుచ
నిన్ను వేఁడినఁ, జంపఁగ నిశ్చయించె. ౪

1. తాపసి, 2. ప్రక్కన, 3. సారాయిమత్తుచే పిచ్చిరెత్తిన వానికి, 4. గొప్పకానుక, 5. మాంసభోజనములను, 6. "బ్రదికి యుండిన శుభములు పడయవచ్చును" 7. శరీరమనుధనము, 8. జీమూత వాహనుఁడు-నాగులరక్షింప ప్రాణమర్పించినవాఁడు 9. అనిత్యము.

ప్రశ్నలు :-(1) జడదారి సిరియాళునితోఁ బల్కిన వాక్యములేవి?
(2) సిరియాళుఁ డేమి బదులుపల్కెను?
(3) 'వీఁడు చిఱుతొండనంబికెన నధికుఁడు'-ఎట్లు?

## 48 సేతు బంధనము

*క. రెండవవారాశివలెన్
మెండగుకపిసేన వారినిధితీరమునం
దుండ; [1]నకుంఠితమార్గణ
మండితుఁ డగురాముఁ డనియె మర్కటవిభుతోన్. ౧

క. "మనబల మిది యతిబహుళము;
వననిధియును దుస్తరంబు; వానరవర, యీ
వ్వననిధి గడచునుపాయము
మన కొక్కటి నిశ్చయింపుమా తగుబుద్ధిన్."

తే. అని విచారించునెడఁ గొండ అధిపుఁ జూచి
[2]జలధి బలితంపుఁదెప్పలం గడత మనిరి;
ఘనపుఁ [3]గలములు సమకట్టి కడత మనిరి
కొంద; ఱంతయు విని రఘునందనుండు.

సీ. అల్లన నగుచు నిట్లనియె, "మీ చెప్పటల్
దగినయుపాయంబు లగున; యయిన
నగణితం బైనయీహరిసైన్యముల కెల్లఁ
గలములుఁ దెప్పలు వలయునన్ని
సమకట్టు టరయ నశక్యంబు, శతయోజ
నంబులపరపైనయంబురాశిఁ
గలములఁ దెప్పలఁ గడచుచో రిపుకోటి
యెదురునఁ బైఁ బడి పొదువ కున్నె

ఆ. అదియుఁ గాక యల్పు లగువణిగ్జనముల
యోజ శూరతతికి నేజ మగునె?
కాన నాదుమతము గా; దివ్విధంబు నా
మనసునిశ్చయంబు వినుఁడు మీరు.

చ. వ్రతము ధరించి నిష్ఠ నుప
వాసవిధిన్ గొలుతున్ సముద్రు; న
కితఁడు ప్రియంబుతోడఁ దెరు
విచ్చుట యంతవ కర్త నేని మే;
లితఁడు నిఁగా నను తలఁచె
నేని, యనూనుపరోషవేష
పితశరవహ్ని నిజ్జలముఁ
బీల్చెద; బ్రేల్చెద నొక్క పెల్లిడిన్.

వ. అని పలికి దశరథసూనుఁడు దానును దమ్ముండును నుపవ
సించి దర్భశయనులై జలధీంద్రు నుపాసించుచున్నంత
సముద్రుండు పొడసూపి తన్నిశ్చయం బెఱింగి యిట్లనియె,-

సీ. "జననాథ, నీకార్యమునకు నే విఘ్నంబు
గావింప నోడుదు నేవిధమున;
వినుము నావాక్యంబు; జను లెల్ల నెఱుఁగ నీ
కిత్తెరి దెరు విత్తు నేని యింక
నిల నెల్లవాఁడును విలసిత దివ్యాస్త్ర
బలమున సాధింపఁ దలఁచు నన్ను;
మీయందుఁ గపివీరుఁ డాయతమతి విశ్వ
కర్మసూనుఁడు శిల్పకర్మవిదుఁడు ౬

ఆ. నలుఁడు నాఁగ నొకఁడు గలఁడు; వాఁ డొలసి నా
యందుఁదరులు గిరులు నొండ నైన,
నవి ధరింతు నేను దివిరి; నీ వది సేతు
వుగఁ గడంక నరిగి పగఱ గెలుము." ౭

వ. అని యతని నొడంబఱిచి సముద్రుండు సనుటయుఁ,
దదుపదిష్టమార్గంబున నలుండు శతయోజనాయామం
బును దశయోజన విస్తారంబును గా నతిదృఢం బగు
సేతుబంధనంబు నిర్మించెను. సాగరోత్తరణం బాచరించి
కపిసేనావారంబు త్రికూటంబు నధివసించెను. ౮

—అరణ్యపర్వము VII

1. మొక్కవోని బాణముల నలంకృతుండైనట్టి, 2. సముద్రమును, 3. ఓడలు, 4. చిటికలో.

ప్రశ్నలు:—(1) కపిముఖ్యులు చెప్పిన సముద్రతరణోపాయము లేవి?
(2) శ్రీరాముఁడు ఏల అవి కూడవనెను? ఆయన నిశ్చయ మేమి?
(3) అందులకు సముద్రుఁ డేమిచెప్పెను? ఏమి యుపాయము చెప్పెను?

## 49 కర్ణుని దానప్రాభవము

సీ. వనమున నప్పాండుతనయు లుండఁగ నందు
వదుసఁబండ్రెడగువత్సరంబు
కడపట నింద్రుఁడు గడఁగి పాండవహిత
కారియై కర్ణునికవచకుండ
లములు మాయాప్రయోగమున హరింపఁగఁ
దలఁచిన, నాతనితలఁ పెఱింగి
జలజాప్తుఁ డొకనాఁడు వెలయ రాధేయున
కది యెల్ల నెఱిఁగింతు నని తలంచి

ఆ. లోకనుతుఁడు బ్రాహ్మణాకార మొప్పంగ
నతనియున్న కడకు నరుగుదెంచి
యేకతంబ యున్న యాకర్ణునకుఁ దెల్పె;
నతఁడు సూర్యుఁ దెలచి యనియె నిట్లు.—

ఉ. "భూసురకోటి వేఁడుటయుఁ,
బోఁడిగఁ బ్రాణము లైన1నిగి నా

జాస; దినేశ, లోకమునఁ
　　2బ్రస్ఫుట మింతయు; నట్లు గావునన్
కీవాసవుఁడట్టి న న్నడుగ
　　వచ్చుఁ బ్రియంపడి! నాకు నొక్క 4బ్రాఁ
తే సురలోకవందిత, మ
　　దింగవచంబును గుండలంబులున్ ?

క. జగముల నెల్లను నిండిన
పొగడిత గడు వెలితి సేసి, 5పొల్లయొడలి కై
తగవే జన్మవ్రత మిటు
దిగవిడువఁగ నేఁడు నాకుఁ ద్రిభువనదీపా? ౪

మ. మతిఁ గుంతీసుతపక్షపాతి యగుచున్
　　మాయాస్వరూపంబుతో
జితధైర్యుండు శతక్రతుండు నను భి
　　క్షింపంగ నేతెంచున
ట్టి తెఱం గైనఁ, దదీయకీర్తియ చుమీ
　　డిందుం; ద్రిలోకీసము
న్నత మై యొప్ప మదీయకీర్తి; యిది సూ
　　నాపుణ్య మెబ్భంగులన్.

ఆ. కీర్తి విడువఁ జాలఁ; గీర్తితో మెలఁగంగఁ
జావు వచ్చెనేనిఁ జత్తుఁ గాని;
జగములోన నెల్ల 6'సడికంటెఁ జావు మే'
లనఁగఁ బరఁగుమాట యనఘ, వినవె? ౫

ఉ. 'కీర్తియ యిచ్చుఁ బుణ్యగతిఁ;
గీర్తియ తల్లియుఁ బోలెఁ బ్రోచు; స
త్కీర్తియ యాయువుర్ సిరియుఁ;
గీర్తివిహీనుఁడ చూ శవంబు; దు
ష్కీర్తను నెల్లచేటులును
గిట్టి హరించు' ననండె తొల్లి భ
క్తార్తిహరుండు నాఁ బరగు
నంబుజసూతి జగద్ధితంబుగన్.

సీ. విప్రులు గడు వేఁడినఁ గడిమితోఁ
బొచ్చెంబుసేయక యిచ్చుటొకటి;
బలితంపుఁబగతురం బరిమార్చు టొక్కటి;
దండి వైరియనిఁ జచ్చు టొండె నొకటి;
శరణాగతుని నెట్టిశత్రుని నైనను
గరుణించి చంపక గాచు టొకటి;
భామినీద్విజవృద్ధబాలాతురుల కైన
యాపదఁ జెచ్చెరఁ బాపు టొకటి;

ఆ. యనఘ, యివి వ్రతంబులై చెల్లు నాకు; నిం
దొకటి దప్పె నేని వికలకీర్తి
నగుదుఁ గాన. యిత్తు నఖిలభావముల నా
ఖండలునకుఁ గవచకుండలములు."

1. ఇచ్చుట, 2. ప్రసిద్ధము, 3. ఇంద్రుఁడు, 4. అధికమా ?
5. వ్యర్థమైన, 6. అపకీర్తి, 7. పరిహాసించి, 8. యుద్ధమందు

ప్రశ్నలు :— (1) సూర్యుఁడు కర్ణునికడకు ఏల వచ్చెను ? ఎట్లు వచ్చెను ? ఏమి చెప్పెను ?
(2) కర్ణుఁడతనిమాట సమ్మతించెనా ? కర్ణుని శపథము ఏమి ?
(3) ఇంద్రునికీర్తి ఏల చెడును ? కర్ణునికీర్తి ఎట్లు పోల్చును ?
(4) సడికంటె చావు ఎట్లు మేలు ?
(5) కీర్తి ప్రభావమేమి ?
(6) కర్ణుని వ్రతము లెవ్వి ?

## 50 విక్రమార్కు నౌదార్యము

సీ. ఉత్తమశ్లోకుఁడౌనుజ్జయినీరాజు
విక్రమార్కుఁడు దానవీరతిలకుఁ
డశ్వమేధాధికయజ్ఞ దీక్షావిధి
గైకొని చేయుచో నాకవి,
గరుడగంధర్వయక్షవ్రాతములతోడ
నరుదెంచి తోడ్పడి యాదరింప
సురల నందఱఁ జూచి ధరణీశుఁ డందులో
[1]రత్నాకరుం డటురామి యెఱిఁగి

ఆ. యతనిఁ దోడి తేర హితుఁ బురోహితు నంపెఁ
బ్రియము గూర్చి మైత్రి నయము మెఱయ;

విప్రవర్యుఁ డపుడు శీఘ్రప్రయాణంబున
దారి నడచి జలధిదరికిఁ జేరె.

అనురాగోక్తిఁ బురోహితుండు నిజరా
జాజ్ఞావిధిన్, "వారిధీ,
నిను నేఁ బిల్చితి; రమ్ము యజ్ఞమునకున్
నీ విష్ణు" డంచున్ ఘన
ధ్వనిగాఁ జెప్పినయంత, నర్ణవుఁడు ది
వ్యంబైనరూపంబునన్
ఘనరత్నంబులు నాల్గు దెచ్చి యనెఁ బొం
తన్నిల్చి యావిప్రుతో.

"ఓ భూసురవర్యా, మీ తేనియజ్ఞ శోభనంబునకుఁ గట్నంబుగా నిద్దివ్యరత్నంబు లిమ్ము. కోరినయంత నిది ధాన్యసంపాదకం బగు; నిది బహుధనప్రదం బగు; నిది మృదువస్త్ర రత్నాభరణదాయకంబగు; నిది సరసాన్న ప్రతిపాదకంబగు;" నని వేర్వేఱఁ దెలియంజెప్పి యిచ్చి వీడ్కొల్పిన, నవ్విప్రుండును తన్మహిమాకర్ణన పూర్వకంబుగా నారత్నంబుల రాజున కర్పించెను. విక్రమార్కుం డంత నాభూసురునితో,

"నీ కిందు వలచినట్టిది
నైకొనుమా;" యన్న, నాతఁ డతిసంభ్రముఁడై
"నా కాంతను నా కొడుకును
నా కోడలి నడిగివచ్చి, నరపతి, కొనెదన్."

విక్రమార్క సౌహార్ద్యశ్లాఘనము

వ. అని యింటి కేఁగి యావద్వృత్తాంతము చెప్పి, నాలో
చించుచు, ౫

సీ. "సైన్యంబు గల్గిన జగమెల్లఁ జేపడుఁ;
గాన నిది యౌఁ;" నని కొడుకు వల్కె;
"తగ 'ధన మూల మిదం జగ' త్తనుమాట
తగు నిది గాన" నని తండ్రి వల్కె;
"నిష్టాన్నములు మదిఁ దుష్టిగాఁ గుడుతుము;
మేలిది గాను;" మని యాలు చెప్పె;
"భూషణాంబరముల భోగార్హ మిది గాంట
వెర;" వని కోడలు విన్నవించె;

తే. ఇట్లు వేఱు వేఱు నిచ్ఛలు దమలోన
జగడమైన, నతఁడు మగిడివచ్చి
యింటివారికలహ మెఱిఁగించి, "వీనిలో
నీవ యొకటి యిమ్ము, దేవ," యనుడు.

క. "ఈనలువుర కిం దొక్కటి
యీ నేల? తలంపుకొలఁది నిట మీజగడం
బే నుడిపెద" నని యొడయం
డానాలుగుమానికములు నాతని కిచ్చెన్." ౬

—సింహాసనద్వాత్రింశతిక II.

1. సముద్రుఁడు, 2. త్వరితగతితో.

ప్రశ్నలు :— (1) విక్రమార్కుని గొప్పగుణమేది ?
(2) అశ్వమేధమున కెవరువచ్చిరి ?
(3) పురోహితుఁడు సముద్రునితో నేమిచెప్పెను ?
(4) సముద్రుఁ డెన్ని రత్నములిచ్చెను ? ఒక్కొక్కదాని ప్రభావ మేమి ?
(5) విక్రమార్కుఁ డొకరత్నము కోరుకొమ్మన్న విప్రుఁ డేమనెను ?
(6) విప్రకుటుంబమున నెట్లు వివాదముకలిగెను ? ఎట్లు తీరెను ?

## 51 నృగకథ

సీ. ఉత్తమబ్రాహ్మణుం డొకనికి నొక్కనాఁ
డొకగోవు నిచ్చితి; నుల్ల మలర
నతఁడును గొనిపోయె; నది మేఁత కర్థి మా
కదుపులలోపలఁ గలసి వచ్చె;
గోవులు మఱియును గోపాలకులు దానఁ
విధికి నై తెచ్చుచో, విధివశమున
వానిలో నదియును వచ్చిన నెఱుఁగక
దానంబు చేసితి; దాని మున్ను

ఆ. గొనినయతఁడు [1]దడవి కని, "యిది నాగోవ"
వనియెఁ; బిదపఁ గొనినయతఁడు పెనఁగి
"నాకు నృపతి యొసఁగె" [2]నా, నిద్దఱకును వా
దైన, నన్నుఁ గాన నరుగుదెంచి.

వ. తను తెఱఁగెఱింగించి,

క. "ఇచ్చినవారల కొనఁగా
వచ్చిన, నష్టంబు గలదె, వసుధాధిప?" యం
చిచ్చఁ గడు నొచ్చి పలికిరి
నచ్చనినిష్ఠూరోక్తు లడర విప్రులిరువురున్.

సీ. దానికి నేను జిత్తమునఁ
దాపము నొందుచు, మున్ను గొన్నయ
య్యానితవిప్రు వేఁడికొని,
"మంచివి గోవులు నీకు నూఱు వే
యైనను నిచ్చెదన్; విడువ
వయ్యా మహీసురవర్య, నెమ్మిన
ధేనువు;" నన్న నాస్యమున
దీనత దోఁపఁగ నాతఁ డిట్లనున్.

తే. "పాలు గడుఁ జిక్క; దాని లేఁగ బాగు లెస్స;
వెయ్యి కర్మిలి గలదు; మఱి ప్రియసుతుండు
పాల కేడ్చినయప్పుడ చన్బట్టినిచ్చు
దేవిపాలిద్దైన; నట్టిగో వెందుఁ గలదు?

క. శ్రీవోత్రై నింటిలో నా
గోవృందంగఁ జూతుఁగాని, గోటి మొదవులుం
గావు సరి దానికి;" కని భూ
దేవుండు వోవుటయు నేను దీనత దోఁపన్.

చ. "కనకము ధేనువుల్ మణిని
కాయము లిచ్చెద; నేమి యైనఁ ద
క్కును మది కిష్టమైనయది,
గోరుము గోవున," కంచుఁ జేరి త
క్కిన ధరణీసుపర్వునకుఁ
4గీడ్పడి యెమ్మొయి వేఁడికొన్న, "నేఁ
గొన భవదీయ రాజ్యమును;
గుత్సితవృత్తికి నియ్యకొందు వే?"

తే. అని యొంగాని, నామాటఁ గైకొనఁడ యాత్మఁ
దట్టియెడఁ 5గాలవశగతి యావహిల్లి
*జమునిపంపునఁ 6గృకలాసజన్మ మొంది
వసుధనీరీతిఁ బడియున్న వాఁడఁ జిరము.

తే. దేవ, నీదగు కారుణ్యదృష్టి యమృత
పూరమునుబోలె నామీఁదఁ బొలయుటయును
దీనదశ వాసె; భవదనుజ్ఞానిరూఢి
నేను జనియెద 7సంచితస్థానమునకు.

వ. అని నృగుండు వాసుదేవునకు సవినయ
రించి విమానంబున నుత్తమలోకమునకుఁ జోయెను.

1. పరామర్శించి చూచి, 2. అనిపలుకఁగా, 3. స్వాగతమును, 4. తగ్గిన ప్రమాణముతో, 5. వృత్తి, 6. ఊరకపెట్టి, 7. ఆజ్ఞాపూర్వకమైన పదవికి.

## 52 పర్వతనారదోపాఖ్యానము

సీ. నారదుండును వానినర్మిలి చెలియలి
కొడుకు పర్వతుఁడును గూడి వసుధఁ
ద్రిమ్మరు వేడుక దివినుండి యొక్కటఁ
జను దెంచి, తమలోన 1సమయ మొకటి
నిష్కర్షఁ జేసిరి; "నిజచిత్తవృత్తులొం
డొరులకుఁ దాఁపక యుండువార;
మఱుఁగాక దాఁప, శాపార్హత వాటిల్లఁ
గలయది;" యని; యిట్లు కలయఁబలికి

తే. యుచితవర్తనమున నుండి, యొక్కనాఁడు
సృంజయునిఁ గాంచి, యతఁడు విశిష్టభక్తి
నర్చనము చేయఁగను, "భవదాలయమున
ననఘ, వసియింతుమే కొన్ని దినములు?" లనిరి.

వ. అందులకు నా పృథ్వీపతి ప్రియంబంది సుకుమారి యను నిజనందనను తత్పరిచర్యార్థంబు నియోగించెను. నారదుండు దానిపై మనసు చిక్కి కృశించుచుఁ దనలోఁ జెప్ప సిగ్గుపడుచుండుటం గాంచి పర్వతుండు,

ఆ. "రాచకూఁతుమీఁద రాగంబు పుట్టుట
నాకుఁ జెప్పవైతి; నీకు శాప
మిత్తు; నమ్మృగాక్షి నీవు చేపట్టిన
యంత వానరాస్యుఁ డగు;" ననవుడు. 3

వ. నారదుండును "నీకు నాకలోకంబునకుఁ జనుట లేకుం
డెడు" మని ప్రతిశాపంబిచ్చెను. అంతఁ బర్వతుండచ్చో
టువాసి యథేచ్ఛం జనియె.

శా. శాపప్రాప్తికి నోర్చి తా నడిగె నా
చంద్రాస్య నన్నారదుం;
డాపృథ్వీపతి యీఁ, బ్రియంబున వివా
హం బయ్యె; నామాత్రలో
నాపూజ్యర్షియు [2]వానరాననతఁ బ్రా
ల్పారంగ, నక్కాంత త
ద్రూపప్రాప్తి విరక్తగాక, తగఁ బ్రీ
తిం జేయుచుండెం బతిన్.

*సీ. అటు లాపతివ్రత యర్చించుచుండ నా
రదుఁ డొక్కదివస మరణ్యమునకు
నేదేనియుం బని కేఁగినయెడ, నందుఁ
బర్వతుం డగపడి భక్తి నెఱఁగె;
వాఁడాతశాపంబు లోనరంగ నిజవృత్త

మరలించి రాజమందిరము చేర
నరుగఁగా, నారదు నారాజపుత్త్రిక
పరపూరుషుం డని వాసి చనఁగ

ఆ. నగుచుఁ బర్వతుండు, "నాతి నీపతి యగు
విశ్వసింపు;" మని సవిస్తరముగ
శాపములును విమోక్షసంవిధానములును
జెప్పి తేర్చె దానిచిత్తవృత్తి. ౬

వ. ఇట్లు నారదుండును బర్వతుండును బరస్పర ప్రియ
కారులై యుల్లసిల్లిరి. ౭

—శాంతిపర్వము I.

1. ఒడంబడిక. 2. క్రోఁతిమొగము కలుగుటచే, 3. శాపవిమోచన ప్రకారములు.

ప్రశ్నలు :— (1) పర్వతనారదుల బాంధవ్యమేమి? వారుచేసికొన్న యొడంబడిక ఏమి?

(2) నారదుఁ డెట్లది తప్పెను?

(3) పరస్పరము వారిరువు రిచ్చుకొనిన శాపము లేవి? ఎట్లు అవి తొలఁగినవి?

(4) సుకుమారిపాతివ్రత్యము నిరూపింపుము.

## 53 అవివేకి చెలిమి

క. కాననమం దొకబహుఫల
సూనక మగుమ్రాన నొక్కసూచీముఖ మ
న్వానరమును దమలోపల
నూనిన నెయ్యమున నుండ, నొకనాఁటినిశన్.

క. మి న్నెల్ల నీలమేఘ
చ్ఛన్నంబై యొక్కవాన సాంద్రజలం బై
మున్ను గురిసి, తుద నీఁదయు
సన్నపుఁజినుకులును విపినచర బాధలు గాఁ

వ. ఎడతెగక యున్నసమయంబున వానరంబు చెలి యగు నగ్గిజిగాఁ డొక నాఁడు.

చ. మిడుఁగుఱుఁబుర్వు వెన్క
మృత్తిక పాదున నంటఁ జేసి యొ
క్కెడ నఱలోన నిడ్డ నది
యిమ్ములఁ గ్రాలెడుదీపరేఖ గాం,
దడియనిగూఁటిలోనఁ బ్రియ
దారయుఁ దానును నుండి, సీతునం
[1]గొడుఁగురువోయి యున్న సఖుఁ
గ్రోఁతిఁ గనుంగొని వల్కెఁ గుందుచున్. ర

క. "ఎడ లేదు నిన్ను ర మ్మనఁ;
గడు సన్నము నాగృహంబు; కపివర, పెక్కా
డెడి దేమి? యిట్టిపుట్టువు
వడసినపుడె కాదె నాదు పౌరుష మడఁగెన్? ౫

వ. అని తగుమాటలాడి పెద్దయు వగచి మఱియు నప్పక్షి యిట్లనియె,—

గీ. "కాలఁ జేతఁ బేద కావు; నీయట్టివాఁ
డకట! యుండఁ దగినయాలయంబు
మున్ను చేసికొనవిమోసాన, నీపాట్లు
పడఁగవలసె నిపుడు నడికిరేయి."

క. అని పక్షి హితము చెప్పిన
విని [2]వెంగలి యైనక్రోఁతి, "వీఁడిరవున నా
లును దాను నుండి, న న్నొక
[3]పినుఁగుంగాఁ దలఁచి గాదె ప్రేలం దొడఁగెన్?

వ. తనకటె యిల్లు గల్గెనటె!
తాదొర, నాకటె యిల్లు లేదు; న
న్ననఁ గడుఁ గ్రొవ్వె నీపులుఁగు;
పుచ్చెద దీనిమదం;" బటంచుఁ బె
ల్లనఁ దరుశాఖ విర్చి కపి
యచ్చటిచేరువ [4]పల్వలోదకం
బునఁ బడ వైచె, నంత వెఱ
పుట్టి ఖగాంగన కూయుచుండఁగన్.

1. (చలిచే) మెలికలుతిరిగిన, 2. మూర్ఖుఁడైన, 3. లోభినిగా 4. నీళ్లుగల చిన్నపల్లము.

ప్రశ్నలు :—(1) నాఁటినిశను వర్ణింపుము.
(2) గిజిగాఁడు చీఁకటివాపికొన నేమిచేసినది?
(3) అది క్రోఁతితో నేమి చెప్పెను?
(4) క్రోఁతికి ఏల కోపమువచ్చెను? అది ఏమి తలపోసికొనెను? ఏమి చేసెను?
(5) నీతియేమి?

## 54 సత్యభామ యీసు

[పారిజాతకుసుమమును కృష్ణునకు నారదుఁడు కానుక పెట్టుటయు, నతఁడు దానిని రుక్మిణీదేవికి పసదన మిచ్చుటయు, దేవముని సత్యభామను చిన్నఁజేసి రుక్మిణిని గొండాడుటయుఁ జెలికత్తె చెప్పఁగా విని, సత్యభామ ఇట్లు దుఃఖించెను,—]

శా. "ఏమేమీ; [1]కలహాశనుం డచటికై
యే తెంచి యట్లాడెనా?
యామాట ల్చెవియొగ్గి తా వినియెనా
యాగోపికావల్లభుం?
డేమే మాడెను రుక్మిణీసతియు? నీ
విం కేటికిం దాఁచెదే?
నీ మోమోటలు మాని నీరజముఖీ,
నిక్కంబు జెప్పఁగింపవే.

చ. అతులమహానుభావ మని
యవ్విరి దా నొకపెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ
[2]నూడిద యిచ్చిన నిచ్చెఁ గాక త
నతఁడు ప్రియంబు గల్గునెడ
కర్పణ సేసినఁ జేసెఁ గాక; యా
శిమతకరి వేలుపుందపసి
మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్

క. పలుదెఱఁగుముళ్ల మాటలు
'కలహామె కల్యాణ' మని జగంబులవెంట
న్నెలఁగెడుమాటకి సహజము;
వల దని వారింప వలదె వల్లభుఁ డతనిన్ ? 3

క. ముని యేమి సేయు? రుక్మిణి
గొన నేర మదేమి? దూర్తగోపాలుఁడు సే
సినచెయిద మేమి చెప్పుదు?
మన 4మెరియెదె ప్రాణ మైనమగఁ డిట్లయినన్ ? ౪

ఉ. ఇన్నిదినంబులు న్సవతు
లిందఱలోఁ గడు గారవంబునన్
గన్నియ, నన్ను వల్లభుఁడు
గన్నులఁ గప్పుకొనంగ నుండి, యా
వన్నెయు వాసియుం దఱిఁగి,
వారు ననుం దల లెత్తిచూడఁగా
నన్నలఁ జాయలం బలుక
నైతును! ప్రాణము లెంతతీపొకో!

ఉ. నామొగమోట్కకై వలని
నాటకము ల్ఘటియించి, రుక్మిణి
కామినిమీఁదటం గలుగు
గౌరవముం గృపయుం బ్రియంబుఁ ద
నేమియుఁ గానసీక, యిట
నిన్నిదినంబులు నన్నుఁ దేల్చె; నో

తామరసాక్షి, మెచ్చవల దా
రమురదానవభేదికృత్యముల్ ?

క. పూనుకొని మేలుగీళ్లకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగదో!
యానరకాసురదమనుఁడు
దా నెఱుఁగఁడొ! భోజకన్య తా నెఱుఁగదో!

క. కలకాల మొక్కగతిఁ, బూ
సలలో దారంబుమాడ్కి, సతిమదిలోనన్
మెలఁగెడుపురుషులు గలుగుట
దొలుజన్మమునోముఫలము తోయజనేత్రా

సీ. కలలోననైన నవ్వులకైన నామాట
జవదాఁట వెఱచు నో చంద్రవదన,
ఏ పదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగఁ డోయిగురుఁబోఁడి,
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చు నో చంచలాక్షి,
తోడిచేడియలు నాతోడివంతులకు రా
నియ్యరింపఁ జాలఁ డోసన్నుతాంగి,

తే. యరమరలు లేనికూరిమి ననఁగిపెనఁగి
కొదలు దీఱనికోర్కులఁ గూడిమాడి,
కపట మెఱుఁగనిమమతలఁ గలసిమెలసి
యున విభుఁ డిటు సేయునే యోలతాంగి!

క. పతి ప్రాణసదృశబంధువు;
పతి దైవం; 7బేడుగడయుఁ బతి సతులకు; న
ప్పతియుఁ గడు మేరదప్పిన,
గతి కులకాంతలకు వేఱు గలదే? చెప్పుమా!

క. ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగ వచ్చు; మగఁ డింతులకు
జన విచ్చి పుచ్చుకొన్నను
మన వచ్చునె? యింక నేటిమాటలు? సెప్పుమా." ౧౧

క. అని వగల మిగులఁ బొగులుచు
జనిరితామర్షమునఁ గోపసదనంబునకుఁ
జనియెను లతాంగి, 9హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁ బోలెక్

-పారిజాతాపహరణము. I

1. నారదుఁడు, 2. కౌసుక, 3. మ్రాయలమారి దివ్యముని, 4. దహింపవా? 5. ఇచ్చలేకయు నున్నట్లు నటియించి, 6. (మురాసురని సంహారించినాఁడైన) శ్రీకృష్ణుని, 7. రక్షకము, 8. కోపముచే, 9. మంచిగంధపుఁజెట్టు తొఱ్ఱలోనికి.

ప్రశ్నలు:—(1) సత్యభామ చేటి నే మడిగెను?
'కలహాశనుఁడు' సార్థకమా?
(2) నారదుని తప్పేది యని సత్య నిశ్చయించి పలికెను?
(3) 'ధూర్తగోపాలుఁడు' అని ఏల సత్యభామ తన విభుని నిందించెను?

(4) ప్రాణము లెంతతీపొకో'' అని సత్య ఏలఅనుకొన్నది?
(5) మురదానవ భేదికృత్యము లేవి?
(6) సత్యభామ కృష్ణునికి మేలుగీళ్ళకు ఎప్పుడుఅందుకొనెను
(7) సతికి ఏది తొలుజన్మమునోముఫలము ?
(8) శ్రీకృష్ణుని యరమరలులేనికూరిమికి సత్యభామచెప్పిన యుదాహరణములు లేవి?
(7) కులకాంతకు ఎప్పుడు గతి లేక పోవును?
(8) సతి కేది యోర్వవచ్చును? ఏదియో ర్వరాదు?
(9) కోపనమైన సత్యకు ఏ సాదృశ్యము కవి చెప్పెను ? ఏమి సారస్యము?

## 55 పారిజాతాపహరణము

క. హరి యపుడు పారిజాతా
హరణోద్యోగమున నందనారామము ని
ర్భరగతిఁ జొచ్చె [1]విహగవర
పరివృఢుపయి నెక్కి సత్యభామయుఁ దానుఁ.

వ. అంత శ్రీకృష్ణుఁడు రభసంబునఁ బారిజాతమును బెకల్చి హరింపఁగా నచ్చటి వనపాలు రందఱు నడపడి యిట్లనిరి,—

చ. ''తగునె యదుప్రవీర, యిటు
ధార్ష్ట్యము నీవొనరించి, [2]యీమరు
న్నగము హరించి పంచనఁ జ
నఁ [illegible]

క్కగ నిజకాంత; కాకుసుమ
కోమలయాజ్ఞ భయంబు నొందుఁ దేఁ
టిగములు దీనిచెంగట న
టింపను, నిందులఁదావి గ్రోలఁగన్".

ఉ. నావిని సత్యభామ వద
నంబున లేనగ నంకురింప, నే
మే వచియింపఁ బూనుహృద
యేశ్వరునిం గరసంజ్ఞ మాన్చి, చ
న్నేవల జాఱుకొంగు సవ
రించుచు, పీడినకొప్పుఁ బల్మఱుం
జే వెడ దోఁపుచుం బలికెఁ
5 జెందొవచూపులు గ్రేళ్లుదాఁటఁగన్,—

సీ. "వినుఁడు సురేశ్వరువనపాలకులు—వార్ధిఁ
బొడమినయాదివ్యభూరుహాముస
6కింద్రాణి యెవ్వతె? యింద్రుండు నెవ్వఁడు?
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁ డై ధరియించె, నతఁడె చేకొనుఁ గాక,
7 తెక తేర యిది యేమి యొకరిసొమ్మొ?
యిదె నాదువిభునిచే నీ కివదాన్యనగంబు
నొడియించుకొని యేఁగుచున్నదాన;

